# కవిగా చలం



: సమర్పణ :

వజీర్ రహ్మాన్

# కవిగాచలం

:సమర్పణ:
వజీర్ రహ్మాన్

మహాకవి గుడిపాటి వెంకటచలం గారి
గీతాల, కొన్ని లేఖల
సంకలనమ్

- సర్వహక్కులు -

వజీర్ రహ్మాన్

—ముద్రణ—

ప్రథమమ్ : సెప్టెంబర్ : పంతొమ్మిదివందల ఏభై ఆరు

—ముద్రకులు—

శ్రీ శారదా ప్రెస్ : సామర్లకోట

—ముఖచిత్రమ్—

రేమెల్ల వెంకట చిన్నారావు

—బ్లాకులు—

ఎమ్. సి. అప్పాసామిచెట్టి అండ్ కో: మద్రాసు

—ప్రతులకు—

వజీర్ రహ్మాన్: 13-2 లచ్చిరాజువీధి: సూర్యారావుపేట: కాకినాడ

—వెల—

రూపాయిన్నర

ఈలలూ - చప్పట్లూ ... .. ............ వజీర్ రహ్మాన్

ఔను చలం! ఔను సుమా,
ఔను నిజం నీవన్నది:
నీవన్నది, నీవన్నది,
నీవన్నది నిజం, చలం!

[శ్రీశ్రీ కృతి కృతిలో]

'అగాధంలోంచి బైలుదేరే
నల్లని అలలు మొహాన కొట్టి,
ఉక్కిరి బిక్కిరై,
తుఫానుహోరు చెవుల గింగురమని,
నమ్మిన కాళ్ళకిందభూమి దొలుచుకుపోతోవుంటే
ఆ చెలమే నయమని
పరిగెత్తి వస్తా' రన్నాడు
చెలం.

'అవును.
చెలం వచనాన్ని గీతాలుగా కత్తిరించి
వొడ్డించుకుంటారు కూడా'
అన్నాడు వజీర్ రహ్మాన్, వెనక.

విన్న మిత్రులు కాచుక్కూచున్నారు.
ప్రధ్వానం వినబడకపోగా చివరికి రహ్మానే తెగించి
తెలుగు వాంగ్మయాన్ని చెలం గీతాలతో పూగించే
బాధ్యత స్వీకరించాడు.

ఫలితంగా ఈ సమర్పణ.

కవితా ధ్వజాన్ని చేదాల్చి
పాతగోరీల కేసి మొహాలు తిప్పుకుని కూచున్న
వాంగ్మయ పీఠాధిపతుల
నడ్డి విరగొట్టాల్సిన చెలం,
ఎంచాతనో విరమించుకుని;
కృష్ణశాస్త్రిని క్షమించి,
శ్రీశ్రీని ఆశీర్వదించి,
వెనక్కి మరలి వచనంలోకి వెళ్ళిపోయాడు.
అంచాతనే కృష్ణశాస్త్రీ, శ్రీశ్రీ బ్రతికి వున్నారు,
నేటికీ మనలో.

చెలం
తెలుగులో 'కవిత్వం' పేరుతో
ఏమీ వ్రాయ
నిరాకరించడం,
వీరిద్దరినీ రక్షించే ఆలోచనో,
లేక తన వచనానికే గోరెత్తిన తెలుగు దేశం
కవిత్వానికి తట్టుకోలేదనో—
తెలీదు.
చెలానికిసంబంధించిన చాలవిషయాలకిమల్లే
ఇదీ ఇంకా అజ్ఞాతంగానే వుండిపోయింది.

ఐనా,
కవిత్వమనే పేరుతో గాకపోయినా, రాసిన వచనమే
చాలు,
చెలాన్ని 'మహాకవి'గా
పరిగణించేందుకు.

(కాని,
చెలంగారూ,
టాగూర్ అన్నట్లు—
*You live alone and unrecompensed*
*because*
*they are afraid of*
*your great worth!)*

# అన్వేషణ...

నీవు రావు—
నన్ను పోనీవు!
మరల్చి మత్తెక్కించి
స్వప్నాలతో లాలించి
మధుర గానాలలో ఊగించి
పరిపంచానికి
వ్యర్థుణ్ణి చేశావు!

దిగులు కళ్ళతో
వెర్రి చూపులతో
మరుపు మాటలతో
అన్ని విశ్వాసాలు నశించి
తోవ తెలీక
తిరుగు తున్నాడు
ఈ ప్రేమ బైరాగి!

అనాదిగా విన్న నీ పిలుపు
స్వప్నంలో అనుభవించిన
నీ కుంతలాల కొనల స్పర్శ
ఏ యుగాల ఆవలి తీరానో
సంయోగ మనే వాగ్దానం
ఇంతే నాకు
మిగిలిన ఆశలు!

ప్రియా!
నీకోసం వెతికి అలిసి
నా చూపులు తమలోకి
తామే చూసుకుంటున్నాయి
ప్రియా— అని హృదయం
తనని తానే గొణుక్కుంటోంది
ఎండమావుల సౌందర్యానికై
తపించి వాడిలి
ఎండి లయమయ్యే
ఈ నిర్భాగ్యుణ్ణి చూసి
దిక్కులే నవ్వాయి
చుక్కలే ఏడ్చాయి!

యోగుల హృదయంలో
వెలిగించుకునే కాంతి—
నీ చిరునవ్వు!
నా కెట్లా దొరుకుతుంది?

# వానరాత్రి...

ప్రపంచాన్నే తుడిచేద్దామన్నట్లు వీస్తోంది గాలి
నల్లని రాత్రి ఇంకా నల్లని
మబ్బు వస్త్రాలు కప్పురుని యేడుస్తోంది
హోరుమని అరుస్తో వాన
తలుపులు మూసి దీపం వెలిగించుకున్నా
వాన లోపలికి వస్తానని పంతంపట్టి
తలుపు మీద యీడ్చి కొడుతోంది—
తెరవమని.
కొంచం మరచి పోతుంది,
మళ్ళీ నేను గ్యాపకం వొస్తాను గావును
దబ దబా బాదుతుంది!

నావిరహబాధని యీరాత్రిలో
కలిపెయ్యలేనా?

తొమ్మిది

# నేనూ - అమీనా...

## విరహం:

చీకటి లోపల, బయట చీకటి
మోసపడ్డ ద్వేషపు చిక్కని కాంతి
ఒక చూపు ఒక మాట
ఓదార్పు : యేమిటేపు
విరహం మనసులోకి జెర్రుల్ని పిలుస్తోంది!

రంజాన్ చంద్రరేఖవంటి
పెదిమల్లోంచి చిరునవ్వుతో
నిప్పులోంచి హోమంలోంచి
నామీదికి నాచేతుల్లోకి
నావేపుకి అమీనా!
ఎదగని పువ్వు అమీనా!!

# విహారం:

ప్రేమలోకంలో దిక్కుమాలిన బిచ్చగాళ్ళం
చీకట్లో దుమ్ములో మెట్లపై బతికే వాళ్ళం
దెబ్బ తిన్న గుడ్డివాళ్ళం
అనాథులం, అంధకారులం
ఇద్దరం యిద్దరం!

పొడుగ్గా పాకే నీడలో
పెళ్ళలు రాలే గోడలో
చీమలు, బల్లులు, కీచురాళ్ళు
కన్నీళ్ళు, ఎక్కిళ్ళు, వేళ్ళు
ఒకళ్ళ చుట్టూ ఒకళ్ళ వేళ్ళు
వేళ్ల మధ్య వేళ్లు
రెప్పల మధ్య నీళ్లు!

ప్రేమను
నిరసించే నేనూ!
ప్రేమను
ఆసించే అమీనా!!

# మల్లెపూలు...

మల్లెపూలు, తెల్లని మల్లెపూలు!
విచ్చిన మల్లెపూలు!!
ఆ పరిమళం నాకిచ్చే సందేశం
యే మాటలతో తెలపగలను!

సాయంత్రాలు స్నేహానికి
చల్లని శాంతినిచ్చే మల్లెపూలు
అర్ధరాత్రులు విచ్చి
జుట్టు పరిమళంతో కలిపి
నిద్ర లేపి
రక్తాన్ని చిందులు తొక్కించే మల్లెపూలు
వేళ్ళమధ్య చేతులమధ్యా
నలిగి నశించిన పిచ్చి మల్లెపూలు
రోషాలూ నవ్వులూ
తీవ్రమయిన కోర్కెలతో
ఉపించి వాడిపోయిన పెద్ద మల్లెపూలు
సన్నని వెన్నెట్లో
ప్రియురాలి నుదిటి కన్న తెల్లగా
యేమి చెయ్యాలో తెలీని ఆనందంతో
గుండెపట్టి చీలికలు చేసే మల్లెపూలు
తెల్లారకట్ట లేచి చూసినా
యింకా కొత్త పరిమళాలతో
రాత్రి జ్ఞాపకాలతో
ప్రశ్నించే మల్లెపూలు
ఒక్క స్వర్గంలో తప్ప
ఇలాంటి వెలుగు తెలుపు
లేదేమో— అనిపించే మల్లెపూలు
అలిసి నిద్రించే రసికత్వానికి
జీవనమిచ్చే ఉదయపు పూలు
రాత్రి సుందర స్వప్నానికి సాక్షులుగా
అవి మాత్రమే మిగిలిన
నా ఆప్తులు!
మల్లెపూలు!!

వదమూపు

# విరహమ్...

ప్రియుడి రత్యాలింగనం తరవాత
సంతుష్టిచెందిన ముఖం వలె
గాలిలోని కొత్తని చల్లదనం
శరీరం మీద తగిలి
హృదయంలోకి దూసుకు పోతోంది
ఆకాశం మబ్బుల వెనక మాయమైంది
నిద్రకమ్మిన కన్నువలె
వొక్క నక్షత్రం మెరుస్తోంది
ఈ గోలలో గాలిలో, పాపం,
ఏదో పిట్ట లేచి అరుస్తోంది
చప్పున గాలి ఆగింది.
నదికూడ నిశబ్దమైంది చచ్చిపోయినట్టు

చీకటి నిశ్శబ్దం,
నువ్వే లేవు!

# ధ్వని - ప్రతిధ్వని...

## ధ్వని:

దిక్కులు నిశ్శబ్దంగా మారుమ్రోగే
అన్వేషణ ఫలితంగా
కలుసుకున్నాను నిన్ను!

నీ తెల్లటి నుదుటి మీదపడే
యీ నల్లటి కుంతలాల కోసం,
కార్తీక ఆకాశాన్ని ధిక్కరించే
నీ మెడకింద నునుపు కోసం,
మధ్యాహ్నపు కొండనీడల చీకట్లవంటి
నీ వక్షపు ఛాయల కోసం—
నే నెంత తపించాను
ఎన్ని గీతాలు కీర్తించాను!

నీ కోసం నీ ప్రేమకోసం
నీ ముందు మోకరిస్తున్నాను
నా చేతుల్ని కాదని తప్పించుకుని
అంధకారంలోకి జారి
నానించి దూరమైపోకు
ప్రియా! నన్ను నిరాకరించకు!!
నిరాకరించకు!!!

# ప్రతిధ్వని:

నిరంతరం నా కోసమైన
నీ ఆహ్వానం అన్వేషణ
వినలేదనుకుంటున్నావా?
యీ మహా విశ్వంతో
యే నక్షత్రాల మధ్య
యే కాలాల్లో వుంటావో
కనుక్కోలేక పోయినాను!

రా!
నేనే నీ లోకం
నీ అన్వేషణ
నేనే నీ అనుభవం
నానించే నీ జ్ఞానం
రా! నా చేతుల్లోకి రా!!
చేతుల్లోకి రా!!!

# ప్రేమలేఖ...

రాలేవా?
ఒక్కసారి యీ రాత్రికి రాలేవా?
నీ కిటికీ లోంచి
సముద్రం మీంచి యెగిరి
అద్భుత మహిమావంతమైన యీ రాత్రిలో
నక్షత్రాల కింది వెలుగులో—
రాలేవా?
ఒక్కసారి యీ రాత్రికి రాలేవా?

నిన్ను తలుచుకుని నీ కోసం
శూన్యం వైపు చేతులు జాచి జాచి
నా మనోవేదనకై యేడ్చి యేడ్చి
గతిలేక
యెక్కిళ్ళను లోపలే కుక్కుకుని
పడుకుంటాను ప్రతిరాత్రీ!

నీ కోసం నిద్రలో వెతుక్కుని
చేతులు నన్ను నిద్రనించి లేపి
'ఏది?' అని అడుగుతాయి
సముద్రంలోకి ఎంత ప్రవహించీ
విసుకు చెందని నదివలె
అన్వేషించే గుణాన్ని మనసు మానుకోలేదు
ఇట్లానే రాత్రులంతా
పక్కమీద వొంటరిగా పడుకొని
వుత్త చేతుల్ని శూన్యం వైపుకు జాచి
శుష్కించి మరణించడంలోనే అంతమా?
ఇట్లా నీనించి విరహపడి
చివరికి నువ్వు కలుసుకున్నప్పుడు
మాడి బొగ్గునై వుంటానేమో?
ఈ కలలు కూడా మిగల వేమో?

రాలేవా?
ఒక్కసారి యీ రాత్రికి రాలేవా?
రాలేవా?

# ప్రార్థన...

ఆకాశాన మబ్బుల్లో
జుట్టు విరబోసుకుని,
నక్షత్రాలు పూలుగా
దిక్కులకి చేతులు జాచి,
వింత అరణ్యాంబరం దాల్చి
సముద్రాలే ఘర్మధారలుగా,
మా బాధల్ని ప్రాణాల్ని మరణాల్ని
కాళ్ళకి కట్టుకు తాండవించి,

నూతన సందేశాన్ని
సుందర ప్రణయాన్ని
సృష్టికాంతా
వినిపించు!

పంతొమ్మిది

# నా శైలి...

"బాధ కవిత్వానికి
పర్యాయపదం : శ్రీశ్రీ"

బాధ పడాలి! నలగాలి!
జీవిత రథచక్రాల కింద :
కలంలోంచి నెత్తురు వొలకాలంటే—
అక్షరాలా? పాండిత్యమా?
కాదు!
సంవత్సరాల మూగవేదన
అంధకారంలో అన్వేషణ
దీనజీవుల హృదయాంతర విషాదం
దిక్కులేని దుర్బలుల జీర్ణావేశం
ఎవరితోనూ చెప్పుకోలేని
అధమచారిత్రల గర్భశోకం—

యిదీ నాశైలి!

## నువ్వూ - నేనూ...

సృష్టిదైన విరహబాధ
తన మాధుర్య భారంవల్ల తనే పగిలి
మనిద్దరినీ కన్నది!

జననమప్పుడు మాత్రమే
ఆ వొక్క ముహూర్తమే
మనమైక్యమై వున్నది!

జన్మ మాధుర్యంలో సోలిన మన చేతుల్ని
చిరునవ్వుతో విడదీసి
మేఘ శయ్యల మీద ఆనించి.
ప్రేమ గీతాలు పాడుతో
నక్షత్ర మార్గాల నూరేగించి
యిద్దరి మధ్యనూ అగాధమైన వ్యవధి కల్పించి
ఈ లోకంలో వొదిలారు—

నా నోటినుంచి వచ్చిన మొదటి శబ్దం
పేరులేని నీ పేరు!

అదిమొదలు నీకోసం వెతుకుతున్నాను—

నే నాడుకున్న బొమ్మల్లో
నీవున్నావేమోనని వెతికాను
నేను చదువుకున్న పుస్తకాల్లో
నీరూపం ముద్రించారేమోనని చూశాను
కవులు నీ అందాన్ని
పాడేరేమోనని చదివేను

నీ వెక్కడన్నా కనపడతావేమోనని
మొహాలు వెతుకుతూ
దేశాలు తిరిగాను!

కనపడవు (కాని)
నాకు నీవు చిరపరిచయవు
నీ రూపమగోచరము
నీ స్వభావము మనోభావాని కతీతము (కాని)
నీ కన్న నాకు హృదయానుగతమేదీ లేదు
నీ నామ మనుశ్రుతము
కలలో విన్న గానంవలె
ప్రతినిమిషమూ నా చెవుల ధ్వనిస్తోంది
నా వైపు నడచివచ్చే నీ మృదుపాదరజము
అస్తమయ మేఘాలకు
యెఱ్ఱని రంగు వేస్తోంది
నన్ను వెతుకుతో వచ్చే నీ అడుగుల చప్పుడు
నా హృదయంలో ప్రతినిమిషం
ప్రతిధ్వనిస్తోంది.

నా పరమావధివి నీవు!

ఒకచోట నీ అధరలావణ్యమూ
ఒకచోట నీ కళ్ళ నలుపూ
యింకొకచోట నీ నడుము వొంపూ
ఒకచోట నీ వొంటి మెరుపూ
ఒకచోట నీ కంఠము ఇంపూ
మరి ఒకచోట నీ వక్షము పొంగూ-
(చూసి)
నీ నించి ప్రేమలేఖలని స్వీకరిస్తున్నాను
అనుభవిస్తున్నాను! ఆనందిస్తున్నాను!!

ఒక హృదయంలో నీ ప్రణయమాధుర్యమూ
ఒకహృదయంలో నీ లీలావినోదాసక్తి
ఇంకొక హృదయంలో నీ ఆనంద-
పారవశ్యతా (చూసి)
ఆకర్షించబడుతున్నాను. స్వీకరించి
అనుభవిస్తున్నాను! ఆనందిస్తున్నాను!!

కాని నిరాశ!
ఇవన్నీ నువ్వెట్లా కాగలవు?
మృణ్మయమైన ఆత్మలూ
తమోనిర్మితాలైన మేధస్సులూ
నిన్నూ — నన్నూ
అర్థంచేసుకోగలవా?

ఇరవై మూడు

# నీరూపు...

రాత్రే నీ ముసుగు
నక్షత్రాలే నీ దీపాలు
భూమే నీ ఉయ్యాల
నేనే ఆటబొమ్మ
నీ చెయ్యిమాత్రం నా మెడమీద!

నీతోనే నా ఆటలు మాటలు
నీకోసమే నాకోపం కన్నీరు
నువ్వే నా గర్వం, నువ్వే నా నిరాశ
నీకోసమే యీ ఉదయాలు, అస్తమయాలు

ఈ విశ్వమే నీ హృదయంలో
నువ్వే నా హృదయంలో:

# నీకోసం...

అగాధ జలాంధకార తరంగాలమీద
తేలివచ్చే నీలచ్ఛాయలు,
శీతల వాయు సంచలనంతో కలసి తాకే
మృదుశాంత కీటకరవాలు,
నిశబ్ద నిబిడ ప్రశాంతిలో వూగే
జలజపత్రి సుగంధాలు,
నిఖిలం నిర్నిద్ర నిశ్వాసరహిత
నిరీక్షణావస్థలో వేచివున్నాయి
పేరిమఝుంఝూ ప్రళయానిలం కోసం,
ప్రియా నీకై; సమస్తం నీ కోసం!

# ఎట్లా మరువను నిన్ను...

నేనెట్లా మరువను నిన్ను?
మబ్బుల వెనకనించి నీ దోబూచులు
పువ్వుల వెనకనించి నీ నవ్వులు
నా కళ్ళలో నీ నీడలు
నా సుఖాలలో నీస్పర్శలు
నిదట్లో నీ రహస్యాలు
ఎట్లా మరువను నిన్ను?

చీకట్లో ప్రతిమూలా నీ చేతులే
ప్రతిశబ్దంలోనూ నీ కంఠమే
ప్రతి ఆశలోనూ నీ సహాయమే
ప్రతి దిక్కునా నీ చూపులే
ఎట్లా మరువను నిన్ను?

రాత్రి రాత్రి నీకోసం
వెయ్యి కళ్ళతో వెతికే నక్షత్రాలనడుగు
ఏడుస్తో ప్రవహించే నదుల్ని అడుగు
వెతుకుతో పరుగులెత్తే గాలినడుగు
నీ ద్రోహాన్ని నమ్మలేక
వెలవెలబోయే చందమామనడుగు—
ఎట్లా మరువను నిన్ను?
ఏం చేశాను నేను??

# తలుపుతీ...

తలుపుతియ్యావా.
సరే, మరెక్కడికిపోనూ!
వినపట్టంలేదా నీకు తుఫాను హోరు
తొరగాతీ- కొట్టుకుపోతున్నాను!

పెందరాళే రాలేదని
కోపించి వేసుకున్నప్పుడు
బిగిసిందా:
నీకు రాదా!
పోనీ పలకకూడదా నువ్వు?
వినపట్టంలేదా నాపిలుపు
ఈ గాలివానలో!
మరి నువ్వు కాకపోతే యెవరు
ఎవరు తీయగలరీ ఇనపగడియ?

కొట్టుకుపోతున్నాను
తొరగాతీ!
వినపట్టంలేదా నా పిలుపు
తొరగాతీ!

# నివేదన...

నీకోసం తెచ్చిన
పూలహారం వాడిపోయింది
తోవలోనే పళ్ళు దొర్లిపోయినాయి
వీణ పగిలిపోయింది
నిన్నుపిలిచే నా కంఠస్వరం
నా చెవులకే వినిపించడం మానింది!

అరవై ఎనిమిది

ఎన్ని పగళ్ళు రాత్రిలు నడిచినా
ఎడతెగని అడవి
దూరానమసకలో కనపడీ
కనపడని కోటబురుజులు
ఎంతకీచేరుచకాని సౌధదుర్గాలు।

నాకిక తోవలేదు
తలుపులు మూసేశారు
వెనక్కి వెళ్ళినా, ఇక్కడే
తిరిగి తిరిగి సశించినా
ఆనాడు రమ్మన్న నీమధురస్వరం నన్నువిడువదు।

నీలో తప్ప నాకు లోకంలో చోటులేదు
నీ ఆలింగనంలోతప్ప నాకుశాంతిలేదు
దూరంగా ఆకాశంలో వుండుండి మెరిసే
నీ ఆకాశదీపమొక్కటే గుర్తు
ఈ చీకట్లో గాలిలో నిమిషం వినిపించే
నీ వీణారవమే పిలుపు।

నువ్వే గతి।
నాకికశక్తి।।

ఇరవై తొమ్మిది

# దీపం చుట్టూ...

నన్నని దీపం వెలుతురు కింద
పద్మంచుట్టూ అల్లుకున్న అలలమల్లే
అన్ని వేపులా పరుచుకున్న జుట్టు;
తెల్ల కింద చెదిరే చందమామ ముక్కలవలె
పరుపు కింద జారిన వేళ్ళచివర మెరిసేగోళ్ళు;
ఏవో క్రూరమైన జ్ఞాపకాలతో
భయపెడుతోన్న పెదిమల చివర్లు;
వొంపుల్ని అంటుకు ఆవరిస్తున్న
చీరకుచ్చెళ్ళమీది చారలు!

ఆదీపపు నీడల అందాలు తప్ప
ఏమీ అందవు నా చిన్ని రెక్కల ఆసక్తికి-
ఆచిన్నిదీపం చుట్టూ
తిరిగే పురుగు నేను!

మాప్పయ్

# ఏదితప్పు...

చీకటికి వెలుతురుతో మెరుగుపెట్టినట్లు
నీ జుట్టుమీద చెయ్యేసి
నున్నని చెంపల్ని తాకడం తప్పా?

చీకట్లో మలయమారుతం మీద తేలే మబ్బుకి
వెలుతురొకపక్క మెరుగుపెడితే
దాన్ని తాకాలనుకోడం తప్పా?

నీ ముఖాన్ని వెలిగించి అదృశ్యమయే
ఆ చిరునవ్వును నా ముద్దులతో
యెట్టుని పెదిమలమీద ఆపడం తప్పా?

అస్తమించే సూర్యుడు యెర్రచేసిన మబ్బులోంచి
కనపడే అర్ధచంద్రుణ్ణి అక్కడే ఆపి
ఆ సౌందర్యమనుభవించాలనుకుంటే తప్పా?

**ముప్ఫయ్ ఒకటి**

నాకు తెలుసు,
పరిగెత్తే మెత్తని బూరుగు దూదివంటి
కార్తీకమబ్బును కౌగలించుకుని
చల్లని గాలివీచే మఱ్ఱిచెట్టు నీడలోకి
తెచ్చుకుందా మనుకోడం—
తప్పుకాదు, నాకు తెలుసు!

నాకు తెలుసు,
కాంతులు చిమ్మే శుక్రుడిమీద చిరుమబ్బు కమ్మితే
దాన్ని తుడిచి, ధగధగని నా కోర్కెవలె మండే
ఆ ప్రేమలోకపు కాంతిని అనిమిషుడనై
అనుభవించాల నాశపడటం—
తప్పుకాదు, నాకు తెలుసు!

నక్షత్రాల మధ్యవుండే
అగాధమైన లోతుల్ని
గాఢమైన అంతాల్ని
స్పృశించి అమరత్వం పొందిన
నీకూ — నాకూ తప్పేమిటి?

## వీడ్కోలు...

అస్తమించే సూర్యుడి
కడపటి కిరణం వలె
శాంతిగా మృతిపొందే
యోగి పెదవులమీది
చిరునవ్వు వలె
వాడిపోతున్న పద్మం
చివరి సౌరభం వలె

దూరమౌతున్న రైలు కిటికీలోంచి
అనాయాచితంగా బైటికి జార్చిన మీ చెయ్యి—

ఇది కాదు అంతం
మళ్ళీ కనబడతాను
ఇంతకన్న మధురంగా'
అని ఆశ గల్పించింది!

గాలిలో ఎగిరే మీ ముంగురులు
సాగి దూరమౌతున్న
మీ నించి నా
హృదయానికి పెనవేసుకున్నాయి

స్నేహంలో దైవత్వాని కెత్తడానికీ
విరహంలో కాలి
మసినై
గాలిలో కలిసి పోవడానికీ—

దేనికైనా
మీవాణ్ణి!

# కవిగా చలం

## వజీర్ రహ్మాన్‌కి
## వెంకటచలం
## లేఖలు

క్రీస్తుశకం
పంతొమ్మిదివందల ఏభై ఐదు - ఏభై ఆరు లలో
మహాకవి గుడిపాటి వెంకటచలంగారు
వజీర్ రహ్మాన్‌కి
రాసిన లేఖలలో
కొన్నింటి సంకలనం
ఇందుతో
సమర్పితమ్

ఊపిరి......

24 సెప్టెంబర్ 1955
6 అక్టోబర్ 1955
22 అక్టోబర్ 1955
7 నవంబర్ 1955
16 నవంబర్ 1955
3 జనవరి 1956
6 జనవరి 1956
2 మార్చి 1956
6 మార్చి 1956
8 మార్చి 1956
20 మార్చి 1956
27 మార్చి 1956
14 ఏప్రిల్ 1956
8 మే 1956
19 మే 1956
22 మే 1956
24 మే 1956
4 జూన్ 1956
9 జూన్ 1956
20 జూన్ 1956
26 జూన్ 1956
8 జూలై 1956
20 జూలై 1956
24 జూలై 1956
2 ఆగస్ట 1956
5 ఆగస్ట 1956

......ఠఊఱ

నా స్కెచ్‌బుక్ నించి.......................చిన్నారావు

నా......................

స్కెచ్-బుక్........

నించి......................

తిరిగి

నేటికి గతమైన కాలాన్ని
జ్ఞాపకాలు రగిల్చి విలోకిస్తే
నాముందు నీలినీడల వీధులు!

చలమానుసారం
ఆ సాయంత్రం నీరెండలో యీదుతో
వజీర్ రహ్మాన్‌కోసం వెదుకుతో సాగేను
కాకినాడ హడావిడిలోకి!

మలుపు తిరిగారిద్దరు నవ్వుతో
నాకేసి
నేనెరిగిన వెలుగులతో!

అతనా రహ్మాన్?
అవునతనేమో—
అవునవునతనే—
అతనే రహ్మాన్!

నా పాతవుత్తరాల్లో
ధ్వనించారు చలంగారు,
వజీర్ రహ్మాన్ని
వీక్షించి, సమీక్షించి—
'ఎంత ఉత్సాహమో
ఈ ఉత్సాహాన్నే దేనికో ఓదానికి
సంసారానికీ, సంపాదనకీ, ఆస్తికీగాక
జీవితంలో ఎదిగినకొద్దీ
నిలబెట్టుకోగలగడం
ఎంత సుకృతం! ఎంత అపురూపం!!'

చలమార్ణవంలోకిదూకి
'కవి' ని కనిపెట్టిన రహ్మాన్
ఈనాడు
మరింతలోతుకి తాకి
మనీషి చలాన్ని తెల్సుకు ముగ్ధుడయ్యాడు!

మాటల్లో, పాటల్లో
గీసేగీతల్లో
నేడంతటా, రహ్మానంతటా
చలం రుతువు చరిస్తోంది!
చలం ఛాయ స్ఫురిస్తోంది!!

రహ్మానంటాడూ—
'చలాన్ని త్రావి
నిషాలో వున్నాన్నేను—
ముట్టకు
మెరుపై జ్వలిస్తాను!
తట్టకు
ఉరుమై ధ్వనిస్తాను!'

మైత్రికి పరిచయమే ప్రధానమైతే
రహ్మాన్ ఆగంతకుడు చలానికి!
మరైతే
రహ్మానేమిటి?

చలాన్నే పృచ్ఛిస్తే—
'జీవితంలో
ఇంతకాలం రొష్టుపడ్డావు.
నిలిచి నిన్ను ప్రేమించాలనుకున్న మిత్రుల్ని
జీవితమూ, మృత్యువూ, సంసారాలూ
మింగేశాయి.
ఈనాడు
నీకునిలిచి నిన్ను నీకోసమే
ప్రేమించగల మిత్రుల్నిస్తాను.
తీసుకో—
అని వరంకింద ఇస్తున్నారు
రహ్మాన్‌ని ఈశ్వరుడు'—
అంటారు!

'నాకై వెలిగిన దీపం
నా జీవం
చలం'—
అంటాడు రహ్మాన్!

ఐతే నేనంటానూ—
'చలం తెలీక
చీకట్లో హోరెత్తిన తెలుగుదేశానికి
రహ్మాన్‌లే కొందరానాడు
దీపాలు వెలిగించివుంటే
చలం నేడీతెల్గునాడు
వొదలకపోనేమో!'

కాని
మనచలం! మహాచలం!
నిరంతరాన్వేషి
విశ్వప్రేమికరుషి
ఎలానిలుస్తాడు మనమధ్య?

మల్లెపూల మమతల్నీ
చిరునవ్వుల వెలుగుల్నీ
కోరేచలం! కవిచలం!
ఎందుకు నిలుస్తాడు మనమధ్య?

ఈ సందులలో గొందులలో
బందీలమైన మనమధ్య........

———————— చిన్నారావు

వజీర్ రహ్మాన్ గారికి,

మీరు నాయందలి అభిమానంతో పంపిన Mss అందింది.

మొదట అవేవో మీరు రాశారనుకున్నాను. ఎవరీ గొప్పకవి? అని ఆశ్చర్యపడ్డాను. కొంచం దూరం చదివితేనేగాని, అవి నేను రాసినవని తెలీలేదు. చదువుతున్నకొద్దీ ఇంతగొప్ప కవిత్వం నేనేనా రాశింది అని ఆశ్చర్యపడ్డాను. మీరు వాటిని ఏరి, ఏర్పరిచి, రాయడమూ, అంతకుముందు మీరు వాటిని, వాటిలో కవిత్వాన్ని గుర్తించి, వాటిని మననం చేసుకుని అనుభవించడమూ, ఆ గీతాలకి కొత్త అందాన్నీ బలాన్నీ ఇచ్చిందనుకున్నాను. కాక పోతే, నేను గుర్తించని కవిత్వాన్నీ అందాన్నీ, మీ కళ్ళు గుర్తించ గలిగాయి అంటే, వాటికి మీ హృదయ మాధుర్యం అతికి వుండదా?

నా పైని మీదయ, నా రచనలపైన అభిమానం, ఎంత ఎక్కువగా వుంటే ఇట్లాంటి రచన చెయ్యగలరు మీరు?

'వెనక్కి మరలి వెళ్ళి పోయాడు ఎంచాతనో చలం' అని రాశారు మీరు. నా విరోధులు దేన్ని చాటుకుని విజయ భేరి మ్రోగిస్తున్నారో, మీరూ ఆ పొరపాటులోనే పడ్డారు.

నా వ్రాతలతో, కవిత్వాలతో, యుద్ధాలతో, ప్రణయాలతో, జ్ఞానార్జనతో, సంతృప్తిపొంద నిరాకరించి, కవిత్వాలకీ ప్రణయాలకీ మూలమేదో ఆ కాంతిని అన్వేషించే తీవ్రసాధన కొరకై వొచ్చా నిక్కడికి. నా సత్యాన్వేషణ, నా సౌందర్యారాధన తీవ్రతకి లొంగి సృష్టిశక్తి నాపై కనికరించింది. నా జీవితమంతా ఏద్వారాల్ని వెతికానో, తెరుచుకోమని బాదానో, దూషించానో, ఆ ద్వారాలు కొంచంగాకదులుతున్నాయి, నాసాధనఫలితంగా, నాపైని కరుణతో.

వంభయ్ తొమ్మిది

నేను కొత్తకాంతిని తేబోతున్నాను. నన్ను ప్రేమించే వారికి, కొత్తసందేశాన్ని వినిపించబోతున్నాను. కొత్త సోపానాలు నిర్మించబోతున్నాను నేలకీ మింటికీ.నాకుకొంచం వ్యవధినియ్యండి.

ఈసారి భాషని మించిన ఆయుధంతో పాతగోడలు బద్దలు కొట్టబోతున్నాను.

మీరు ఏరిన గీతాలలోనే తెలుస్తోంది కదా నా అన్వేషణ దేనికో? "యోగులు హృదయంలో వెలిగించుకొనే కాంతి—నీ చిరునవ్వు!" ఆ కాంతినే సాధిస్తే—ఇంక చిరునవ్వుల్ని సాధించనక్కేకద! అదీ నా సాధన ఈనాడు.ఏవొక్క నిమిషమో స్ఫురించే మల్లెపూల ఆత్మసంబంధాన్ని హృదయంలో శాశ్వతంగా బంధించి, ఆ పరిమళాన్ని తక్కిన హృదయాలకి వెదచల్లగల శక్తికోసమే ఈ సాధన.

మీవంటి రసికహృదయంతో, ప్రేమికుడితో, చలం ప్రేమికుడితో, ఈవిధంగా పరిచయం కావడం ఎంతో అందంగా ఆనందంగా వుంది. మీరు పంపిన పుస్తకాన్ని తిరిగి పంపాలా! ఆ గీతాల్ని ఏంచెయ్యతలుచుకున్నారు?

24 సెప్టెంబర్ 1955 శ్రీరమణాశ్రమమ్

చలం

...1...

వజీర్ రహమాన్ గారికి,

మొన్ననే ఓమిత్రులకి రాయబోయినాను. "నాకీమధ్య *express delivery* ఉత్తరాలేం రావటం లేదు. మీరన్నా ఒకటి రాయండి" అని, అనుకున్నానో లేదో మీ ఉత్తరం వొచ్చింది. నన్నంత హృదయంలోకి తీసుకుని రాసిన మీఉత్తరానికి నేనేం తగిన జవాబు రాయగలను?

కాదు. నేను రాసింది నిజం.మీరు అంతప్రేమతో, భక్తితో ఆ గీతాల్ని గుర్తించి, అనుభవించడంవల్ల వాటికి ఓ పరిమళం తప్పకుండా వొచ్చింది. అట్లా కాకపోతే, ఆత్మశక్తి అనే దానికి అర్థమేముంది? మన హృదయం గాఢంగా *feel* ఐనప్పుడు ఆత్మనించి వెలుగుని తీసుకుంటుంది. మామూలు మనిషి అనుకునే స్త్రీని ఒక రసికుడు ప్రేమించనీండి, త్వతలో ఆమెకిదివరకు లేని అందం వొస్తుంది, ప్రపంచం కళ్ళకి కూడా కవపడుతుంది.

మల్లెపూలపైన నేను రాసిన *Musings* కవిత్వంతోనూ, తత్వంతోనూ కూడినవని నాకు తెలుసు. ఎవరన్నా ఇంకోరు గుర్తిస్తారేమోనని ఆశించేవాణ్ణి. *Musings* ని మెచ్చుకునే వాళ్ళలో ఒక్కరూ వాటిని ప్రత్యేకంగా మాట్లాడలేదు. ఒక్క రుక్మిణీనాధశాస్త్రిగారు ఒకసారి *passing* గా — "చాలా కవిత్వముందండీ!" అన్నారు. మరి నా హృదయం మీ వొక్కరికే తెలీడం ఎట్లా జరిగింది?

చాలా మందికి నేనిక్కడికి రావడం అర్థంకాదు. వారి ప్రచారానికి వీలూ దొరికింది. విరోధులకే కాదు మిత్రులకీ. వారి ప్రచారంవల్ల నాకు వొచ్చిన నష్టమేమీ లేదు కాని, ఏసహాయానికో

నా వేపు కళ్ళుతిప్పిన వాళ్ళతో "చలం లాభంలేదు. మతంగాళ్ళతో చేరిపోయినాడనీ, ఇదివరకు తాను రాసినవి కాదంటున్నాడనీ' చెప్పి నిరాశపరుస్తున్నారని. నామిత్రులకీ చాలా మందికి నేను కార్య రంగం వొదిలిపోయినాననే *disappointment.*

నిన్ననే ఓ ఉత్తరంలో ఓ అబ్బాయి రాస్తున్నాడు—"చలం సంగతి వేరు. అతను చేసిన పాపాలకి అతను పశ్చాత్తాప పడుతున్నాడు ఇప్పుడు. కాని...." ఈ విధంగా.

ఇట్లాంటి ప్రచారం నామనసులో వుండి, మీరు వెనక్కి వెళ్ళారని రాస్తే, నేనే పొరపాటులో పడ్డాను. మీరుకాదు.

ఇక్కడి నాయోగాన్ని మీరు అంతబాగా మీ అంతట మీరే అర్థం చేసుకున్నందుకు నాకెంతో సంతోషంగా వుంది.

ఫలించే ఘడియ సమీపించిందని రాశానా? ఈ కృషిలో కాలమూ దూరమూ అవగాహనకాదు. దూరమనుకున్నది దగ్గరవుతుంది. దగ్గరనుకున్నది దూరమౌతుంది, చివరికి దగ్గిరా దూరమూ రెండూ ఒకటేనని తెలుసుకున్నదాకా.

ఈ విషయాలు రాసి ఎవరికీ ఉపయోగపడవు. ఎవరికన్నా కొంత దూరం కళ్లు తెరవడం సాధ్యమవుతుంది, మహానుభావులకి. సత్యం సంపూర్ణంగా అందుకున్నవారికి.

నాకు కవిత్వం చేతకాదు. ఏమీ పలకదు. ఆఛందస్సు ఇరుకు. నా శైలినడక గమనిస్తేనే తెలుస్తుంది. నేను చెప్పతలచు కునేది చెప్పడానికని అన్ని భాషానియమాల్నీ తెంపులు చేసుకున్న నేను, ఛందస్సులోకీ, ఓ నడకలోకీ ఇమడగలనా?

నా మీది మీ ఇష్టం, నా రచనలపైని మీ అభిమానం మీ ప్రతి అక్షరంలోనూ ధ్వనిస్తున్నాయి. మీవంటి సహృదయులు,

నాకు ఇంత ఆలిస్యంగా రావడమూ. ఇంతదూరం కావడమూ, విచారం. కాని చచ్చింతరవాత రావడంకన్న అదృష్టం కాదూ!

మీరీగీతాలు ప్రచురించడానికి నాకేం అభ్యంతరం? మీరు *afford* చెయ్యగలిగితే! చాలా బావుంటుంది ప్రచురించడం- మీరు రాసిన మాటతో సహా.

మనం కలుసుకుంటా మంటున్నారు ఈశ్వరుడు.

ఆరోజుకి ఎదురుచూస్తో—

6 అక్టోబర్ 1955 శ్రీరమణాశ్రమమ్

చలం

...2...

చలం

*

వజీర్ రహ్మాన్ గారికి,

మీ ఉత్తరమూ ,కవిత్వమూ. మీ ఉత్తరమూ కవిత్వమే. మీ అభిమానం ఎంతగొప్పగావుంది నాకు. మీ హృదయంలోఅంత కవిత్వముండగా మీరు 'మురికివీధుల్లో' ఎట్లా సంచరిస్తారు? ఎండపడి నాచుగుంట బంగారు మల్లే మెరిసేట్టు, కుళ్ళులోకమైనా మన నేత్రాల్లోంచి కాంతిపడి నూతనత్వాన్నీ, శుభ్రతనీ పొందుతుంది.

"భగవాన్ పాదాలముందు" అనే పుస్తకంలో గీతాలు నేను *attempt* చేసినవికావు. ఏదీ వుద్దేశించలేదు. భగవాన్ నాకు ప్రసాదించినవి. నాలోంచి పలికినవి.

వాటి *spirit* కవిత్వంకాదు. కవిత్వం ఏమాత్రంలేదు. వాటిప్రయోజనం వేరు.

తన ఆధ్యాత్మికానుభవాన్ని కవిత్వంలో పాడగలగడం ఒక్కటాగూర్కే చాతనవును. ఎవరు ఆధ్యాత్మికానుభవానికి *allegorical form* ఇవ్వాలన్నా, టాగూరు గారి కాళ్ళలో నడవక తప్పదు. ఎక్కడో ఓ చోట. అట్లానే టాగూరుగారు సూఫీ గీతాల్నీ, వైష్ణవ గీతాల్నీ, బౌల్ పాటల్నీ తాకక తప్పిందికాదు. ఎందుకంటే ఆధ్యాత్మికానుభవం అవధిలేనిదైనా దాని *expression* మన *concepts* నీ, పదాల్నీ, ఉపయోగించుకోవాలని చూస్తే, దాని *scope* చాలా *limited.*

బైబిలు లోని *Psalms,* ఉపనిషత్తుల్లోని స్వరాల *freshness* ఎవరు పట్టుకోగలరు?

కవిత్వం పరంగా చూస్తే, 'భగవాన్ పాదాలముందు' లో మీరు చూపిన లోపాలన్నీ ఉన్నాయి. కాని అది కవిత్వం కాదు. అక్కడ *repetition* తప్పదు. టాగూర్ గార్ని సహితం, ఒక్కటే *idea* ని పది పుస్తకాలు నింపాడనే విమర్శకులున్నారు— ఆయన తన కవిత్వంలో అంత *variety* ని చూపినా.

.... ... సరైన కారణం కనపడితేనే గాని, ఇంకోరి అభిప్రాయానికి లొంగిపోకండి. మన అభిప్రాయం తప్పే కావొచ్చు. తప్పైతే అదే అనుభవం కొద్దీ సరి అవుతుంది. కాని ఆ అనుభవం మన స్వంతఅనుభవమై వుండాలి. ఇంకోరి అనుభవం మనదికాదు. మీకు గౌరవంగల వారు చెప్పిందానికి మీ గౌరవాన్ని పట్టి విలవనిచ్చి విచక్షణతో చూడండి. కాని చలం గాని, ఇంకోరుగాని అన్నారుకదా అని మీరు మారకండి. దేనికైనా, మతంలోగాని, జీవితం నడకలోగాని, అభిప్రాయాలలోగాని, లొంగామా తినేస్తారు. అదుముతారు. ఇంక మనకి స్వంత బతుకు వుండదు. వాళ్ళ నీడలో ఎదగడమే గాని, మన ఎదుగు ఇంక ఆఖరు.

మీకు సరి అని తోచిందా, ఈ కొత్తవాటినికూడా మీ పుస్తకంలో చేర్చుకోండి. నా అభ్యంతరంలేదు.

పేరూ మీరే యోచించండి. అదీ మీదే నిర్ణయం.

నా పీఠికా? అది అసాధ్యంగా తోస్తుంది. ఈ నాడు ఏమీ రాయలేను. మీరు చెప్పిన *lines* లో అసలు రాయలేను. అశక్తత. అంతే.

ఆ 'భగవాన్ పాదాలముందు' అనే పుస్తకం చాలా అసహ్యంగా అచ్చువేశారు. ఆ పద్యాలు నావికావు. ఎవరివో

దొర్లాయి. ఆ అచ్చు వేసినవారు దొర్లించారు అంత అసందర్భం
ఏంచెయ్యను?

పైగా ఇంకోటి— నా పీఠికలో మీరు వ్రాయమంట
విషయాలు నాకుతెలియవు.

నా రచనలన్నీ ఎట్లా ఉద్భవించాయో, సాగాయో, మీ
తెలిస్తే, ఈ నాడు నేను రాయలేని బాధ మీ కర్ధమౌతుంది.

మీరు రాసిన దానికన్న అందమైనదీ, అవసరమైనదీ, మీ
నే యోచించుకోలేను.

ఈ ఉత్తరం ముగించింతరవాత— తప్పలేదు. అ
కొన్ని పాదాలు అక్కడక్కడ ఏరి ఒకటిగా కూర్చడం. క
దాన్ని ఇంకా సుదీర్ఘంగా, సాఫీగా వుండేట్టు ప్రయత్నించం
వీలైతే, మీకు కూడా అట్లానే తోస్తే.

22 అక్టోబర్ 1955 శ్రీరమణాశ్రమ

చలం

...3...

వజీర్ రహ్మాన్కు,

మీ *express* వుత్తరం ఇప్పుడే అందింది. వెంటనే జవాబు రాస్తున్నాను. నాకు తలంటిపోశారు. తలంటి ఇష్టంలేదు. కాని పోశారు. రోజంతా బావుండదు. మబ్బులుపోయి ఈవాళే మంచి ఎండవొచ్చింది. మీ దగ్గర్నించి ఉత్తరమూ వొచ్చింది. అందులో నా కిష్టమైన *express letter*.

ఏదో గొడవగా వున్నట్టుంది మీ మనసు. నా వుత్తరం అందిందా? దానివల్ల ఇబ్బంది కలిగిందా? ఏంరాశానో ఏమిటో! ఏం రాయకే వొదిలానో!

ఎప్పుడూ ఉత్తరాలూ అక్షరాలమీద—కాదు, అసలు మనిషి మాటలమీదకూడా ఆధారపడకండి.

ఇక్కడి నా సాధన అలసట—శరీరానికి మనసుకి. ఉత్తరాసికి మంచి *mood* రావాలని చూస్తాను. ఆలస్యమౌతుంది. ఇంక గతిలేక రాసేస్తాను. అందుకని నా ఉత్తరాలు నా హృదయం అనుకోకండి.

నా మనసులో ఏ మార్పూ లేదు. నా అక్షరాలు అట్లా ధ్వనించి వుంటాయి. కాకపోతే మీలో ఈ బాధకి కారణం కనపడదు.

నాకే శక్తివుంటే నేను ఇక్కడవుండే మీముందు కనపడి-ఏదో యోచించు కుంటాను — అందమైన నా కలలతో నిండిన పూర్వపు సూర్యారావుపేట —— నా బాల్యం, యవ్వనం ——

ఏభయ్ ఏడు

పెద్దవీధిలో గుడికి దగ్గిరగా నా ప్రాణం కొట్టుకుంటో, చుట్టూతిరిగిన ఇళ్ళు — ఆ పక్కసందులో ఎక్కడో ఓ ఇంట్లో ఒక్కడూ వజీర్ రహ్మాన్—

మీ ముందు కనపడి, మీ తలని చేత్తోదువ్వి,

"ఏమీ గొడవపడకు, నేను ఎప్పుడూ వున్నాను నీతో. ఎప్పుడో జీవితపు హడావిడిలో ఎదిగి, నువ్వు నన్ను దూరం చేసుకోవలసిందే గాని నే నెప్పుడూ నీ కోసమే చూస్తోవుంటాను" అని దయగా మాట్లాడివుందును.

గొడవపడవొద్దు. నాకు అర్ధమవుతోంది మీ హృదయ తీవ్రత. దాన్ని చూస్తే ఈ ప్రేమనీ, ఈ విశ్వాసాన్నీ స్వీకరించి నిలుపుకోగల అర్హత నాకెంతవరకువుందాఅని వెతుక్కుంటాను. కాని మనమధ్య ఈశ్వరుడున్నారు. మిమ్మల్ని నాకు దగ్గిరగా తెచ్చారు.

"జీవితమంతా రొష్టుపడ్డావు. నిలిచి నిన్ను ప్రేమించాలనుకున్న మిత్రుల్ని, జీవితమూ మృత్యువూ పంసారాలూ మింగేశాయి. ఈనాడు నీకునిలిచి నిన్ను నీకోసమే ప్రేమించగల మిత్రులిస్తాను. తీసుకో" అని వరంకింద ఇస్తున్నారు నిన్ను.

ఏమీ బెంగపడకండి.

7 నవంబర్ 1955 — శ్రీరమణాశ్రమమ్

**చలం**

...4...

చలం

వజీర్ రహ్మాన్ గారికి,

మళ్ళీ మీనించి *express* వుత్తరం— అందులో ఆదివారం నాడు. ఎంతో బాగుంది.

మిత్రులూ, బంధువులూ, ప్రపంచమూ, ఎప్పుడూ అంతే : మామూలు రైలుపట్టాలనించి తప్పి నడిచేవాళ్ళని, వెళ్ళనీరు. వాళ్ళందుకే పుట్టింది.

వాళ్ళు ఓ పట్టాన వొదలరే! మిమ్మల్ని అంత సులభంగా వొదులుతున్నారంటే అదృష్టమే. కాని ఆవేషాలు తీసేసి, కొత్త వేషాలు వేసుకుని, తిరిగి తిరిగి అడ్డుపడుతోనే వుంటారు. కాని వొదలరు.

మనకి ఒక ఆత్మ అనేది వుంది. దాన్ని స్వతంత్రంగా కాపాడు కోవాలంటే, మిత్రులేమిటి, ప్రతీవారూ వొదిలి పోతారు. శత్రువులుతప్ప,మనని ప్రేమించేవారుకూడా మనదగ్గిరికి రావడానికి భయపడతారు. స్వేచ్ఛ అనేది అంత అగ్ని. కాని నిజమైన స్వేచ్ఛ మన ఆత్మది. మనని నిజంగా కట్టేసేవి, మనకోర్కెలు, మన ఆశలు. వాటిని వొదిలించుకోడానికని మనలో యుద్ధం ప్రారంభించిననాడు, అసలు భీభత్సం అప్పుడు ప్రారంభం.

ఇదంతా మిమ్మల్ని భయపెట్టడానికికాదు నేను రాస్తున్నది. మిమ్మల్ని సిద్ధంచెయ్యడానికి. ఈకాస్తకే జంకకూడదు యోగుడు.

నన్ను ఉత్తరాలు *disturb* చెయ్యడమా? నిజమైన శాంతి దేనివల్లా *disturb* కాదు. ముఖ్యం మిత్రులనించి, ప్రేమించే

ఏభయ్ తొమ్మిది

మిత్రులనించి, కాంతిని అన్వేషించే సాధకులనించి. మీవంటివారు తెలియచేస్తో వుంటారు తిరిగితిరిగి ఈశ్వరుడు ఎట్లా విజృం భిస్తున్నారో క్రిమంగా ప్రపంచంలో. మీవంటి అన్వేషకులకు నా పుస్తకాలు దోహాద మిచ్చాయంటే, గర్వించతగిన విషయం కాదా!

తపస్సు, ధ్యానం— అంటే ప్రపంచాన్ని వొదిలి మూల వొదగడంకాదు, సర్వాన్నీ ప్రేమలో కావలించుకోగల శక్తికోసం వెతుక్కోడం.

మీరు పుస్తకానికి పెట్టిన పేరు బావుంది.

మీరిక్కడికి రావడానికి ఎప్పుడూ మా ఆహ్వానం మీతో వుంది. మీ *wish* మీ *convenience* చాల దూరం— గట్టిగా పిలవ లేను. నేను ఇక్కడనించి కదలడం జరగనిపని. కనక పిలవ డమనేదే నేను చెయ్యగలిగినపని.

ఇక్కడ ఏడాదికోసారి నవంబరు డిశంబరుల్లో, దీపోత్సవం జరుగుతుంది— పదిహేనురోజులు. అది మొదలుకాబోతోంది. లక్షలలో వుంటారనుకుంటా వొచ్చే ప్రజలు. వూరికి దూరంగావున్నా మాకూ తగులుతుంది హడావిడి. రోజూ మా ఇంటికెదురుగా వుండే గిరిచుట్టూ తిరుగుతో వెదుకుతో వుంటుంది ప్రజ, ఓనదిమల్లే. పౌర్ణమినాడు సాయింత్రం అరుణగిరిశిఖరంపైన దీపం వెలిగిస్తారు. రెండు రోజులుపైగా అట్లా వెలుగుతోనే వుంటుంది.

భక్తి, జీవితంలో ఎంతబలమైన ప్రోద్బలమో, ఈ దేశంలో ఈ క్షేత్రాలలో చూడవలిసిందే.

మిమ్మల్ని కట్టేసుకోడమా? భార్యనీ, పిల్లల్నీ తనకి కట్టేసుకుంటున్నాడు పురుషుడని ఇన్నేళ్ళు యుద్ధం చేసిన నేను!

అరవయ్

ఎక్కడికి పోగలరు మీరు? సత్యమనే అమృతం మీ రక్తంలోకి ఎక్కాంతరవాత ఎక్కడికి వెడతారు? వెళ్ళినా, వెతుక్కుంటూ త్వరలో తిరిగి వొచ్చేవారే! మిత్రుల బలమెంత? చాల తక్కువ. అసలు గండాలు రెండు. నేను రాశాను కదా! పెళ్ళి, కాపురమూ, ఉద్యోగమూ, హోదా! ఆ సుడిగండాలలో నన్ను ప్రేమించిన యువకులు, యువతులు, అనేకులు ఆహుతి అయ్యారు.

ఏదినమ్మినా, ఏదిసందేహమైనా, మానవుడి హృదయంలో సత్యాన్వేషణ అనేది వుందని, తనకన్న ఉన్నతమైన దానికోసం దేని కోసమో, ఏదో ఓ రూపాన నిరంతరం చేతులు జాస్తాడనేది నిజం. దానికే అనేకమైన పేర్లు. ఈశ్వరుడు, శృంగారం, మాన వాభ్యుదయం. *self-fulfilment, love of truth, patriotism, adventure,* జ్ఞానతృష్ణ. ఇట్లాంటివి. కనక జీవశక్తి ఉన్నవాడు సంసారోద్యోగాలలో నిలవలేడు. హృదయంలో ఆ వెలుగు మంద గించినవాడు ఓ నిమిషం దేనివల్లనో ఉత్తేజితుడైనా, చూస్తో వుండగానే, మర్యాదా మామూలు అనే *octopus tentacles* లో చిక్కి దూరమౌతాడు. ఏంచేసీ రక్షించుకోలేము అతన్ని. తాత్కా లానికి గాంధీగారి వెలుగు ప్రతిఫలించి మెరిసిన ఈ స్వతంత్ర మహాసమరపు అతిరథులందరూ ఈనాడు ఏంగా మారారో చూస్తున్నారుకదా! యవ్వనంలో ఏ ఒక్క శృంగార తృష్ణలోనో, మర్యాదని ధిక్కరించిన ప్రేమికులు, మాడి బొగ్గులై, లేక మళ్ళీ కుళ్ళి శవాలై తిరుగుతున్న వారెందరు!

కనక చాలవరకు మనబలం, మన పుటకతో మన హృదయంలో ఎంత వెలుగుతో పుట్టామనే దానిమీద ఆధార పడుతుంది. మామూలు దృష్టితో చూస్తే, ఈ విధంగా ఓ నిమిషం ఏ ఆశయానికో నిలబడి చల్లబడ్డవాళ్ళకంటే, ఏమీ లేకండా, మత్తుగా, మామూలుతనంలో బతుకునీడ్చేవాళ్ళు అదృష్టవంతులుగా,

జ్ఞానులుగా కనపడతారు. కాని ఏ ప్రయత్నమూ వృధాపోదనీ, ఎప్పటికీ, ఎన్ని జన్మల తరవాతనైనా, సహాయం చేస్తుందనేది విశ్వాసార్హం.

ఈశ్వరాశీర్వాదాలతో–

మీరుపోయినా, ఈశ్వరుడు మిమ్మల్ని పోనీరు.

16 నవంబర్ 1955. శ్రీరమణాశ్రమమ్

చలం

...5...

వజీర్ రహ్మాన్ గారికి,

మీఉత్తరం ఇన్నాళ్ళకి. మీరు రాయడం లేదేమా? అని నేను తలుచుకుంటూనే వున్నానుకద! మీరు రాయాలని అనుకుంటూనే వున్నారుకద! ఇంకేమి? ఉత్తరాలు రాసుకోకపోతేనేం? ఉత్తరాల లోనూ, మాటల్లోనూ ఏముంది?

ఏ స్నేహమైనా, క్రమంగా మౌనంలోకి ఇంకకపోతే, అది లోతు తక్కువగానే వుండిపోతుంది, చెరువుమల్లే.

రాయాలని ప్రయత్నించకండి, రాయటంలేదే? అని దిగులు పడకండి. లోపలిభావం పైకి మాటలతో రాతలుచుకున్నప్పుడే అక్షరాలలోకి మార్చండి.

ఒక్కొక్కప్పుడు ఏమీ రాయలేము. వుత్తరాలు సాగవు. అంటే మీరు ఎదుగుతున్నారన్నమాట.మీలో మార్పు వొస్తోందన్న మాట. ఏమీ గొడవపడకండి. నాతో పరిచయాన్ని మామూలు రొటీన్‌లోకి తేవడం ఇష్టంలేక, అమూల్యంగా చూసుకుంటున్నా రన్నమాట.

నాకు రాశేప్పుడు ఏవో గొప్పవంగతులు రాయాలనుకోకండి. మామూలుగా మిత్రులలో *prattle* చేశేట్టు, పట్లు వొదిలిరాయండి. ఉత్తరం సాఫీగా వొస్తుంది. ఆరోజు ఏంచదివారు, ఏంతిన్నారు, ఏంచూశారు, ఏంఆలోచించారు? అన్నీ నాకుచాలా *interest,* మీసంగతులు తెలుసుకోడం.

నేనూ రాస్తాను. కాని నావిషయమై, కొంచెం *indulgence* చూపాలి మీరు. కొన్నిరోజులు *heavy correspondence*

వుంటుంది. సాధనవల్ల వ్యవధీ తక్కువ. వోపికా తక్కువ. ఇట్లా అన్నానని. నన్ను శ్రమపెడుతున్నానేమోనని. రాయడం మానకండేం? మీనించి ఉత్తరాలు నాకు ప్రత్యేకం. నామిత్రులు నలుగురైదురినించి వొచ్చే ఉత్తరాలవలె మీఉత్తరాలకోసం వెతుకుతోనేవుంటాయి కళ్ళు.

మీనించిగాని. నావించిగాని ఉత్తరాలు లేకపోవడం ఏలోపంకాదు. కాని మీనించి ఉత్తరం వొచ్చిందా. చదవడమూ, రాయడమూ చాలా సంతోషం.

ఆ సమర్ సేన్ ఎవరో? మీరు ఇంగ్లీషునించో. బెంగాలీనించో తర్జుమా చేసింది. గొప్పకవిలాగున్నారు. మీతర్జుమా ఎంతో బావుంది. ఎంతగట్టిగా గ్రహించగలిగిందో ఆయనలోని రసాన్ని మీహృదయం? చాలా బావున్నాయి ఆరెండూ. తక్కిన రెండూనా అవి నా *taste* కి కొంచెం దూరం, బావున్నాయి కాని—

3 జనవరి 1956 శ్రీరమణాశ్రమమ్

చలం

...6...

వజీర్ రహ్మాన్‌గారికి,

మీ ఉత్తరం, నేనుపంపిన ఆహ్వానమూ, రాసిన ఉత్తరమూ అందేవుంటాయి.

మీకు ఇంగ్లీషులోగాని, ఉర్దూలోగాని, పర్షియన్‌లోగాని సూఫీ కవిత్వం తెలుస్తా? శృంగారగీతాలు తెలుసునా, చివరిరెండుభాషల్లో! తెలుగులో ఎంకిపాటలు ఇష్టమా? కొత్త ఎంకిపాటలు చదివారా?

సూఫీ కవిత్వం చదివితే, దేవుడిలో నమ్మకం లేకపోయినా ఆ కవిత్వంలోని ఈశ్వరుణ్ణి ప్రేమించకుండా నిలవలేడు ఏ సహృదయుడూ. అట్లాంటి ఈశ్వరుడే వుంటే ఇంకేంకావాలి? అని ఎంతో వాంఛిస్తాము.

నేను కనుకున్నది ఇన్నేళ్ళకి—

ఉన్నారని—

*I am - that I am.*

ఇంకా ఆ వెలుగుని హృదయంలో చూసే యోగ్యత లేదనేది నా నిరంతర విషాదం.

మీరన్నట్టు— 'భక్తుడి మొహానికి వొచ్చే తేజస్సుని ఆరాధించకుండా ఎట్లా నిలవగలం, సౌందర్యప్రేమికులం!'

ఆ తేజస్సే ఈశ్వరుడు!

ఈశ్వరుడెవరో మనకి సరిగా చెప్పేవారులేక, ఆయన్ని ఎరగనివారు ఎరిగినట్లు మాట్లాడడం వల్ల, రాయడం వల్ల,

ఈశ్వరుడు అంత పనికిరాని వాడైనాడు, బుద్ధిమంతులకి.

*Japan* కవి రాసింది చాలా బావుంది. మనం చూసే *reality, dreams* అన్నీ దేనిపైన ఆధారపడి; చలిస్తూ పరుగెత్తుతున్నాయో ఆ వెలుగే ఈశ్వరుడు. వీటి అన్నిటి వెనకా వుండే *pure light consciousness* —ఈశ్వరుడు. మన చిన్న మెదళ్ళకి గ్రాహ్య మయ్యేందుకు, మన బలహీనమైన చూపు భరించేందుకు, ఇన్నిరూపాలలో మనని కావలించుకుంటున్నారు ఈశ్వరుడు.

ఇదంతా మిమ్మల్ని విశ్వాసంలో పెట్టాలనికాదు. నేను చూసిన సత్యాన్ని పంచుతున్నాను.

మన సందేహాలా? మనతో ఈశ్వరుడి ఆట. దోబూచులు.

6 జనవరి 1956 శ్రీరమణాశ్రమమ్

చలం

...7...

వజీర్ రహ్మాన్ గారికి,

చాలా రోజులకి మీ ఉత్తరం. నా కనుచూపు (చదవడానికి) బలంతక్కువ ప్రస్తుతం. కళ్లజోడు మార్చాలేమో! మీ చిన్న తేలికరంగు అక్షరాలు తెలుసుకోలేకపోయినాను.

బుద్ధదేవ్ బోస్ జీవితంలో ఓ మహాత్యం జరిగిందని మొన్ననే విన్నాను. అతనూ ఇతనూ ఒకటేనా?

ఎందుకురాదు నిద్రమీకు? అమితంగా టీ తాగుతారా? తగినంత వ్యాయామం తీసుకోరా? అంతకు మించిన కారణాలా?

"నిద్ర ప్రసాదించకు........"

చాలా బావుంది, ఎన్నో జ్ఞాపకాలు వొచ్చాయినాకు.

సమర్ సేన్ ఎందుకు రాయడం మానేశాడో మీకేమన్నా తెలుసా?

మీకవిత్వం నాకు నచ్చకపోవడం — ముఖ్యం *taste*. ఎంత విశాలం చేసుకున్నా మనసు తన *habits* నించి తప్పించుకోలేదు — అందులో 50 ఏళ్ల అలవాట్లు. ఎప్పుడూ నాకు *subject - matter* తో తగాదాలేదు. దాంటో కవిత్వం గోచరించాలి. కవిత్వం అంటే నాకు యీ మామూలుతనాన్నించి అందంతో పైకెత్తే గుణం.

వాస్తవాన్ని *as it is* గా *accept* చేసే ధైర్యం నేనిచ్చి వుండవొచ్చు. కాని ఆమాత్రమే ఐతే సారస్వతప్రపంచంలో దాని విలవ తక్కువ. అది ఏమన్నా కావొచ్చు — కాని కవిత్వం

కాదంటాను. మీరు నాపుస్తకాల్లోంచి మీకు నచ్చి ఏరిన *pieces* ని చూస్తే తెలుస్తుంది మీకు. నేను ఏమంటున్నానో? నిత్యజీవితంతో సంబంధంలేని భావాలని' ఎదిరించాలని. వుత్తనిత్యజీవితమే *photographic* గా చిత్రిస్తే ఎట్లా! *Human excreta* ఫొటో తియ్యవొచ్చు. అది *art* కాదు. *Artist* దాంట్లోంచి ఏదో గుండెనిపట్టే సందేశం వొచ్చేట్టు చిత్రిస్తాడు. ఆ సందేశం లేకండా వుత్త *realism art* కాదు. అది నా అభిప్రాయం మొత్తానికి.

మీరు రాసిన 'దోమల రాత్రి'లోని భాగంలో కవిత్వం లేక పోలేదు. కాని దాన్ని చదివి వూపిరి సలపకుండా అయ్యాను. సరిగా నా రాతలకు విరుద్ధం అది. ఎవరూ చూడనిచోట *remance* కల్పించాను నేను. *Sex* ని నక్షత్రాల కెత్తాను. మీ గీతం *stark realism*. కాని ఏమాత్రం అందమైన భావాలున్నా *sex* సి గురించి వాటిని హత్య చేస్తోంది. 'దానిపేర' అనేప్పటికే చెవి ఎదురు తిరిగింది. అది నా పద్ధతి. నాకెందుకు నచ్చలేదో చెప్పాను. నాకు నచ్చలేదు గనక, అది కవిత్వం కాదని కాని, వాటి విలువ తక్కువ అని కాని నేననటంలేదు. *It is my and my circle of appreciation*. కనక నేను విలువకట్టలేను. నన్నడిగారు గనక, నా అభిప్రాయం చెప్పాను. అంతే విలువ ఇవ్వండి నా విమర్శకు.

'భగవాన్ పాదాలముందు' కాపీ పంపుతున్నాను. ఈఉత్తరానికన్న ముందే చేరుతుంది మీకు.

'భగవాన్ పాదాలముందు' చదివితే, మీ కది ఏ అనుభూతిలాగు తోచింది? ఏదన్నా అందంలోకీ, ఆనందంలోకీ వెడుతున్నట్టా, లేక ఏమీలేని జడత్వంలోకీ, శూన్యంలోకీ వెడుతున్నట్టా!

అరవయ్ ఎనిమిది

ఈ ఆధ్యాత్మిక సాధనని గురించి దేశంలో వున్న దురభి ప్రాయలకి రెండు ముఖ్యకారణాలు—

1. దాని సంగతి తెలీక, ఈ జీవితం పైనా, సుఖం అనుభవించే వారిపైనా కసివల్ల, ఇదంతా వొదిలి, ఏదో చీకట్లోకి పొమ్మన్నట్టు రాసిన అవివేకుల బోధనలు.

2. పూర్తిగా తెలిసి, ఆ *bliss* అనుభవించి, దాన్ని ఎట్లా చెప్పాలో తెలీక, 'ఇదికాదు. ఇదికాదు. ఈ రెంటినీ మించిన స్తితి' అని సత్యం చెప్పాలనే పట్టుదలతో బోధించిన జ్ఞానుల బోధనలు.

రెండో విషయం తెలుసుకోలేని స్తితి గనక, మనదే లోపం.

ఏలాగో, ఎక్కడో, మీరీ సాధననిగురించీ, గమ్యస్థానాన్ని గురించీ, తప్పు అభిప్రాయంలో పడ్డారు. నేను అట్లాగే వుండేవాణ్ణి. మొన్న మొన్నటి దాకా.

బాధా, ఆనందం, వీటి భేదాలకి, విరోధాలకి మించి, వాటి నన్నిటినీ *include* చేసుకోగల స్తితి అది.

నిష్కామత— అంటే— ఆలోచించండి. కోరినవన్నీ లభించేలోకం వుందనుకోండి. అక్కడ నిష్కామతగాక ఏముంది? మీకే వాంఛలున్నాయో, ఆ వాంఛలు మీకే ఆనందాన్ని ఇస్తాయని కలలుగని వాంఛిస్తున్నారో, అంతకన్న గొప్ప ఆనందం మీతో వుంటే, ఇంక వాంఛించేందుకు ఏముంది? చల్లని గాలిలో; వెన్నెట్లో, ప్రియురాలితో ఏకాంతంగా కూచున్న రసికుడు, సినీమా నీడల శృంగారపు రసాల్ని అనుభవించడానికి పోతాడా! ఆలోచించండి. ఈ పైవాక్యంలో ప్రతీఅక్షరం సత్యం. ఆ ఆనందం ముందు— ఇవన్నీ నీడలు— వెకిలి ఎంగిళ్ళు.

అరవయ్ తొమ్మిది

మీరు రాసిన మాటలకీ నేను రాసిన మాటలకీ అట్టే తేడా లేదు. నే నిదివరకు పుస్తకాల్లో రాసిందే రాస్తున్నారు. ఆ నిరంతర నిర్నిద్రాన్వేషణే నన్ను అరుణాచలానికి తీసుకు వొచ్చింది. మీరూ— డబ్బుకీ, దర్జాకీ, పలుకుబడికీ, భార్యకీ, లొంగిపోక, మీరీనాడు రాస్తున్న ఆశయాన్ని జ్వలింపచేస్తో నిలుపుకున్నారా, ఇక్కడే చేరతారు.

ఆనందాల లోతులోకి, ఉద్రేకాల అంచులకి శక్తివున్నంత వరకు పయనించారా, ఈ క్షేత్రాన్నే చేరుకుంటారు.

'కవిత్వానుభవం' అంటే ఏమిటి? ఆ కవిత్వం సూచించే శృంగారానుభవం. వాస్తవంలోని ఆ అనుభవానికీ,(అది దొరికితే) కవిత్వం చదివితే వొచ్చే అనుభవానికీ, వున్న తేడాయే; ఈ ఇంద్రియాల అనుభవానికీ, ఆధ్యాత్మికానుభవానికీ తేడా.

మీరు చివర రాశారే, నేను కోరే ముక్తి ఈ సుఖదుఃఖాల నించి — అని. అదే నేనుకోరే ముక్తీ, అసలు ముక్తీనూ. ఈ దేహంతోనే, ఈ మనసుతోనే తప్ప, ఈ 'నేను' అనే పంజరంలోంచి తప్ప అనుభవంలేని ఇరుకునించి, 'నాకు' అంటో అన్నీ దాచుకుని, లాక్కుని అనుభవించే దేవుళ్ళాటనించి విముక్తే, ముక్తి. ఎన్నిచోట్ల కొట్టుకున్నానో, ఈ విముక్తికోసం నా పుస్తకాలలో.

మీరు పంపిన సమర్ సేన్ గీతాలు, చేసిన మార్పులు, చాల బావున్నాయి. అచ్చయినాక వీలుంటే కాపీ పంపండి.

ఈ గొప్ప కవిత్వాన్ని అర్ధంచేసుకుని, అనుభవించి, తెలుగులోకి, వాటి రసం అంతా వొచ్చేట్టు రాయగల ప్రజ్ఞ మీలోనే వుంది.

చెలం

'నజ్రుల్ ఇస్లాం'ని పూర్వం కలకత్తారేడియోలో వినే వాళ్ళం. సౌరిస్‌కి ఇంకాబాగా ఇష్టం. అతనేమిటి, పిచ్చా ఇప్పుడు అతనికి?

నజ్రుల్ ఇస్లాం బావుంది. కాని సమర్ సేన్‌వి అంతకన్న చాల గొప్పగా వున్నాయి.

*D. H. Lawrence* – అంత బాగాలేదు. నేను చదవలేదు ఇదివరకు.

మీ సన్న అక్షరాలు చదివి, కళ్ళు అలిసిపోయినాయి– మళ్ళీ రాస్తాను.

నిన్న మీ రెండో ఉత్తరం అందింది.

లారెన్సు గీతంలో కొన్ని భాగాలు చదివేందుకు నాదృష్టి బలం చాలలేదు. జాగ్రత్తగా ప్రతి అక్షరం చదవగలిగితేనేగాని నేనేమీ చెప్పలేను. గొప్పగా వున్నట్టుంది. కాని కవిత్వం తక్కువ. కాని సరిగా చదవాలి.

*Portrait of a genius, but...* అనే పుస్తకం మీదగ్గిర వుందా?

అన్నిటికన్నా మీరు రాసిన ఉర్దూగీతం తర్జుమా ఎంతో అందంగా వుంది. ఏ కవిత్వమూ దాంతో సాటి వొచ్చేట్టులేదు. ఈ అనుకరణాలు మీరు అద్భుతంగా చేస్తున్నారు. మాతృకకన్నా అనుకరణాలే గొప్పగా వున్నాయేమో ననిపిస్తోంది.

ఇంక నా మహమ్మదీయపాత్రల సంగతి– 'అమీనా' నిజమైన కథ. ఆయజమాని మాత్రం అంత నీచుడుకాదు,

దెబ్బ్య్ ఒకటి

ఆపుస్తకంలో రాసినంత. కథ పట్టుకి అట్లా మార్చాల్సివొచ్చింది. 'అమీనా' నిజమైన పిల్లే.

నా మహమ్మదీయమిత్రులు నాకు ఇష్టులు. హిందూస్త్రీలు మహమ్మదీయుల్ని ప్రియులుగా ఇష్టపడడం గమనించాను. నా ముస్లింమిత్రుల్ని చూస్తే గొప్ప ప్రియులు అవుతారనిపించేది.

వాళ్ళల్లో ఒక *dash* వుండేది. తక్కిందంతా కథపట్టు కోసం, కొంత ఈ హిందువుల *complacency* నీ, *superiority* నీ *shock* చెయ్యడంకోసం రాసినవి. ఈ కారణాలు వూరికే యోచింపడంగాని, అసలు అట్లా పాత్రలు వొచ్చారు. అది నేను యోచించి చేసిందికాదు. చాలా కథలు నేను యోచించి రాసినవి కావు. ఎట్లా వాటంతట అవి వొస్తే, అట్లా రాశాను. నాప్రయత్నం లేదు! మరి వాళ్ళమీది స్నేహం ఏజన్మదో!

*K. K.* నాయుడుగారు జ్ఞాపకంలేరు.

మొదటి వుత్తరం అయింది. రెండో వుత్తరానికి జవాబు రేపు.

2 మార్చ్ 1956 శ్రీరమణాశ్రమమ్

చలం

వజీర్ రహ్మాన్ గారికి,

నిన్న మీకోవుత్తరం పోస్టు చేశాను. పుస్తకమూ పంపాను. ఎక్కడి ఉర్దూకవిత్వం, ఎక్కడి కాలజ్ఞానతత్వం? ఈ రెండు విధాలైన కవిత్వమూ మిమ్మల్ని ఆకర్షించిందంటే, మీహృదయం కవిత్వరసానికి ఎంత సున్నితంగా స్పందిస్తుందా అని ఆశ్చర్యం వేస్తుంది. ఈ తత్వంకీర్తనలు ఇదివరకు కొన్ని కొంచెంగా అప్పుడప్పుడు నేను వినడం తటస్థించింది. వాటిని చూస్తే నాకు ఇష్టంలేదు. చాలవాటిల్లో అర్థం కనపడేదికాదు. పైగా ఏదో గుబులు. అసలు వేదాంతమంటే గిట్టదు. మీరు ఏరినవి గొప్పగా వున్నాయి.

బ్రహ్మంగారని వినడమే. నాకు తెలీదు ఏమీ.

అవును. దీక్షితులుగారి పుస్తకానికి పీఠిక వ్రాశాను. తప్పకండా చదవండి.

'తెలుగువిద్యార్థి' లో ఒక్కటే వ్యాసం రాశాను. కాని కష్టపడి సంపాయించి చదవనక్కర్లేదు.

ఆరుద్ర సంగతి, చిన్నారావుగారు రాసింది, నాకు జ్ఞాపకం రావటంలేదు.

అంత కవిత్వరసాన్ని — ఎక్కడ, ఏరూపంలో వున్నా, అనుభవించగలిగినవారు — మీరు ఈశ్వరుడికి దూరమేమిటి? తెలీకండా ఆయన్ని ప్రతినిమిషమూ తాకుతోనే వున్నారు మీరు.

పరీక్షలు ఐపోయినాయా? కాలేజీ మూసినా కాకినాడ లోనే వుంటారా?

డెభ్భయ్ మూడు

కళింగలకి ఎప్పుడన్నా వెడతారా మీరు? అక్కడ ఇంకా పెసరట్లూ పుణుకులూ చేస్తున్నారా? లేక నాగరికత తుడిచేసిందా వాటిని?

ఎప్పుడు బుద్ధిపుడితే, అప్పుడు ఇక్కడికి రావడానికి మీకు మా *standing invitation* వుందనేది మరిచిపోకండి.

6 మార్చి 1956 శ్రీరమణాశ్రమమ్

చలం

...9...

చలం

వజీర్ రహ్మాన్ గారికి,

మీ పుస్తకం వెంటనే పంపుతున్నాను. చాలా బావుంది. చెయ్యవలసిన మార్పులేమీ లేవు. *Get up* మొదలైనవన్నీ మీరే చూడాలి. నాకు అవి తెలీవు.

లేఖలపైన 'శ్రీరమణాశ్రమం' అని వుంటే బావుంటుంది. కాని మీ ఇష్టం?

మీ ఉత్తరాలు రెంటికీ రెండు జవాబులు రాశాను. ఉత్తరాలు ఎట్లానూ వేస్తున్నారు గనక — ఆ ఉత్తరాలలో ఏమన్నా పనికి వొస్తాయేమో చూడండి. కొంత *matter* చదివేవారికి *appeal* అవుతుందేమోనని.

ఎంతో బావుంది పుస్తకం. నాకు గర్వంగా వుంది.

మీ రెంత శ్రద్ధ తీసుకున్నారా, అని ఆశ్చర్యం.

ఆ గీతాలు, ఎవరివైనా కానీ, అట్లాంటివి ఏ సహృదయు డైనా ఆరాధించవలసిన విలవగలవి. కాని ఇన్నేళ్ళు ఎవడు చూశాడు? వాటి రచయితే గుర్తించలేదు వాటివిలవని — ఇన్నేళ్ళకి మీరు జన్మించి, గుర్తించి, సేకరించి, ఎత్తి చూపిందాకా!

ఇంకా ఈ పుస్తకం లావుగా కావాలంటే, అమీనా, యవనవ్వనం, ఓ పువ్వు పూసింది, జయదేవ, ఇట్లాంటి పుస్తకాలలో ఘట్టాలు వున్నాయేమోసని జ్ఞాపకం— కాని అది ఈ *lyrical pieces* లో జతకావేమో — ఇదంతా ఉత్త *idle suggestion*. వున్నట్టుగా పుస్తకం బావుంది. చాలాబావుంది.

డెబ్బయ్ ఐదు

నా *recent photo* వొకటి పుస్తకంచివర అతికించాను.

8 మార్చ్ 1956 శ్రీరమణాశ్రమమ్

చలం

...10...

వజీర్ రహ్మాన్ గారికి,

మీ పెద్ద ఉత్తరం. మొన్న నేను రాసిన కార్డు అంది వుంటుంది. మీరు అచ్చు ప్రారంభించక పోవడం మంచిదే అయింది.

నేను ఎరగని ఎన్నో గొప్ప కవిత్వాలు నాకు రుచి చూపుతున్నారు. వీటినన్నిటినీ పారెయ్య బుద్ధి పుట్టదు. దాచి ఏం చేసుకోవాలో తెలీదు.

*Gertrude Stein* పేరు విన్నాను. ఏమీ చదవలేదు. ఆమె గీతం నాకు *too mystic* గా వుంది. నిరాలా— మీరు అనువదించిన భాగం గొప్పగా, ఆవేదనతో కూడివుంది. ఉర్దూ కవి గాలిబ్ పేరు విన్నట్టు గుర్తు. అంతకన్న ఏం తెలీదు. తెలుగు భాషలో ప్రేమపదజాలం తక్కువకావడం చాలా నిజం. అసలు వీళ్ళకి ప్రేమ కవిత్వం ఎక్కడవుంది, నండూరి సుబ్బారావుగారి ఎంకి పుట్టిందాకా? 'జీవితాన్ని వొడ్డి కవిత్వాన్ని సంపాయించిన కవులు' ఎక్కడ వున్నారు, మహమ్మదీయుల్లో తప్ప!

గాలిబ్ గీతాలు సూటిగా నా హృదయంలోకి దూసుకు పోయినాయి.

ఈ ఉత్తరంలోని మీ దస్తూరి చాలా హాయిగా వుంది నా కళ్ళకి.

మీ గీతాల్లోని *stark realism* తో నాకు తగాదాలేదు. నా పుస్తకాల్లో లేవా అట్లాంటి ఘట్టాలు! మీరు రాసిన 'దోమల

డెబ్బయ్ ఏడు

రాత్రి' లో *lines* తో మీరు ఆగక వాటిని ఒక *idealism* లోకి ఎత్తాలంటాను. వాటికల్లా ఒక *uplifting purpose* వుండాలని. *Stark realism* కవిత్వంకాదు. మీరింకా రాసి మీ భావానికి ఒక రూపం ఇయ్యాలి. మీరు రాశారే మీ ఉద్దేశం, అది నాకు వ్యక్తం కావటం లేదు, ఆ *lines* లోంచి.

'*Sex* లోని అందమంతా మన మనస్సుమీద ఆధారపడితే', అజుగుప్స కూడా మన మనస్సుపైన ఆధారపడలేదా? శరీరం మనస్సుకన్న ఎట్లా ఎక్కువ *real?* శరీరం ఏస్థితిలో వుందో చూసేదీ మనసే కద! మనసు లేకపోతే, శరీరం ఎక్కడవుంది? 'అవును, ఇదందా ఆత్మ కల్పితం.' మీరనుకునేదేకాదు— అంతా— అంతా— అదే వేదాంతం. వేదానికి (జ్ఞానానికి) అంతం.

మీరిప్పుడు, మీ *position explain* చెయ్యాలని నాకు రాసిన చాలా వాక్యాలు, నా *position explain* చేసేందుకు నేను ఇతరులకి ఎన్ని రాసినావో!

జీవితంలో మనం ఏది అంగీకరించినా, అనంగీకరించినా, దానికి కారణాలు ముందు తెలీవు. అందమూ కాదు, *crudity* కాదు. ఎందుకో ముందు జరుగుతుంది తీసుకోడమో, వొది లెయ్యడమో. తరవాత కారణాలకి వెతుకుతాము.

'*Purpose of poetry is not beauty, but truth*' అంటాడే, దాంతో నేను వొప్పుకోను. అది ఎక్కడ నిజమంటే; *when truth is beauty and beautq is truth. Truth can never be ugly. It is our minds that make it ugly or bitter.*

'భగవాన్ పాదాలముందు' ను గురించి మిమ్మల్ని అడిగి నట్టు జ్ఞాపకం లేదే నాకు!

దెబ్బయ్ ఎనిమిది

యశోదా గీతాలలో నా యశోద స్త్రీ కాదు. తల్లి. ఒక మహాత్ములు అన్నారు నన్ను గురించి. నా కథల్లో కూడా నా స్త్రీలలో, ప్రియురాళ్ళలో ఎక్కువ భాగం నేను చూపింది మాతృత్వమేనని. నా స్త్రీలు కులకరు, దొంగ వేషాలు చెయ్యరు, మామూలు చూపులు చూడరు. వారి ప్రేమ ఓ అనివార్యమైన మాతృత్వంగా తీసుకుంటుంది పురుషుణ్ణి. హృదయంలో దాచుకుంటుంది.

ఏమైనా, నేను చెప్పతలుచుకున్న *spiritual truth* కి యశోదాకృష్ణులు మంచి *vehicle* ఐనారు— అంతకు పూర్వం— ఊర్వశీ, పురూరవుల మల్లేనే.

'నేను వ్రాసే *bitter truths* ని......' అన్న వాక్యంమీరు *quote* చేశారే, దాన్ని సందర్భంతో కలిపి అర్థం చేసుకోవాలి. శృంగారాన్ని తేలిక చెయ్యటంలేదు. నేను బోధించాలనుకున్న వాటిల్లో శృంగారం అన్నిటికన్న ముఖ్యమైన *truth.*

మనుషుల్ని *taunt* చెయ్యడానికి ఇట్లాంటి *half-truths* ని ఎన్నిటిని రాశానో: శృంగారమనే మాట ఎంత *range* నో కప్పుతుంది. నిజమైన శృంగారాన్ని అర్థం చేసుకోగల అర్హత ఎందరికివుంది! వుంటే నన్నెందుకు అర్థం చేసుకోరు? మీరు *quote* చేసే కవులు అంత బాధ ఎందుకు పడతారు?

మళ్ళీ "*Reality*" అనే పదానికీ, "*Realism*" అనే పదానికీ చాలా దూరం. నేను *reality attempt* చేశాను— *realism* కాదు.

అవును. యశోదా గీతాల్లో ఆవేదన గట్టిగావుంది. దొరకలేదనీ, అందుకోవాలనీ, కవి ఉద్దేశం దాంటో ఎక్కడా లేదు.

దెబ్బయ్ తొమ్మిది

కవి *feeling* తప్ప కవిత్వమంతా అంతేగా, గాఢమైన జీవితం లాగే— దొరకలేదని దిగులో, దొరికిందని గంతులో!

ఇంక ఆధ్యాత్మిక విషయం— మీ జీవితంలో మార్పు తీసుకు రావాలనిగాని, మిమ్మల్ని సుఖదుఃఖాలనించి తప్పించి, ఎక్కడికో తీసుకు పోవాలనిగాని, నా ప్రయత్నం ఏమాత్రమూ కాదు. ఈఆధ్యాత్మిక జీవితాన్ని గురించి కొన్ని అసందర్భమైన *ideas* మీకు ఉన్నట్టు కనిపించినందువల్ల, నా కిప్పుడు అదే సాధన కనక, వాటివిషయమై నేననుకునే మీ *misconceptions remove* చెయ్యాలని చూశాను. అంతమాత్రమే.

నేను మిమ్మల్ని దీంలోకి రమ్మని పిలవలేదు. ఇక్కడికి ఎందుకు వొచ్చానో, ఎట్లా వొచ్చానో, నా ఆశయం ఏమిటో, మీకేమీ తెలీదు. ఈవిషయంలో నన్ను గురించి మీరు చేసిన *statements* కి వూహతప్ప ఏ ఆధారమూలేదు. ఈ వ్యవహారాన్ని గురించి మీకు ఏర్పడ *misconceptions* తోనే నా మార్గాన్ని మీరు *understand* చేసుకుంటున్నారు.

మీరు చివరికి ఇక్కడికే చేరతారు, ఎక్కడికి చేరతారో, చెప్పగల సాహసం నాకులేదు— నేను చెప్పలేదు. దీంటోకి రమ్మనలేదు.

మీరు ఇద్దరి *saints* ని గురించి రాశారు. ఎంత గొప్పగా వుందో చదువుతోవుంటే! నా కాలానికి అంత దగ్గరలో వున్న వారిని సందర్శించ లేకపోతినే అనుకున్నాను.

మీరు తేలిక చేసుకుంటున్నట్టున్నారు గాని, ఈనాటి నాస్తితిలో, మీకు వొచ్చిన అనుభవం ఎంత అమూల్యమో, ఎంత అదృష్టవంతులా మీరు, అనుకుంటున్నాను.

ఎనభయ్

నాకు మీ సంగతి ఏమీ తెలీకుండానే, మీలో (మీరు ఇష్టపడక పోయినా) ఏదో ఆధ్యాత్మికమైన భాగం వుందని గుర్తించాను. ఆభాగం మీ జీవితాన్ని క్రమంగా కబళిస్తుందో, వృధాగా అణగారి పోతుందో నేనేం చెప్పగలను: కాని మూడు బలమైన కారణాలు. ఆధ్యాత్మికంవేపు లాక్కుపోయేవి కని పిస్తున్నాయి ప్రస్తుతం మీలో—

(1) సుఖదుఃఖాల లోతులు అనుభవించాలనుకోవడం—

(2) నిజమైన కవిత్వంపైన అమోఘమైన ప్రేమ—

(3) అరుణాచలంలో పాతుకున్న చలంతో స్నేహం,

మీకు చాలా సులభమైతే *Portrait of a genius* పంపండి.

నాకు ముస్లింలలో ఆకర్షణకి అర్థంలేదు, కాని ఎందుకో—

(1) *Sufi* కవిత్వం చాలా ఇష్టం. చాలాసార్లు టాగూరుకన్న. టాగూరు ఇంకా వెతుకుతున్నారు. కొందరు సూఫీలు అనుభవించి రాశారు.

(2) ఉర్దూ ప్రేమ గీతాలు అమితమైన ఇష్టం.

(3) ఉత్తరహిందూస్తానీసంగీతం అన్ని సంగీతాలుకన్న ఇష్టం—లక్నో *school*.

(4) *Moghul school of painting* ఇష్టం.

(5) వాళ్ళ తాలూకూ వాళ్ళు ఉపయోగించే *scents* ఇష్టం.

(6) వాళ్ళ గడ్డాలు ఇష్టం—వాళ్ళ కోడికూరలున్నూ.

ఎనభయ్ ఒకటి

(7) ఇటూ అటూ చూడకండా, సమస్తమూ అర్పించే సాహసం ఇష్టం.

మీరు రాశారే ఇద్దరు *saints* జీవితాలు. వాళ్ళలో ఈ *spiritual life* లో తటస్థించే ఓ రెండు గొప్ప *truths* *illustrate* ఐనాయి. ఆ జీవితాల్ని తెలుసుకోవడం నాకు చాలా సంతోషమైంచి. ఇట్లాంటివి నాచుటూ వుంటే ఈ రమణ భక్తులు ఒప్పుకోరు. వాళ్ళ మడిమార్గాలు తప్ప వేరే చూడలేరు.

మీరు చేసిన మార్పు 'తలుపు తియ్యనన్నావు' లో బావుంది.

20 మార్చి 1956

శ్రీరమణాశ్రమమ్

చలం

…11…

చలం

వజీర్ రహ్మాన్ గారికి,

మీరు పంపిన గీతాలు ఆ *selections* అన్నీ కూడా చాలా బావున్నాయి. కొన్ని ఎక్కడివో నేను గుర్తించలేక పోయినాను.

వాటితో పంపిన మీ గీతం (ముద్దు) ఎంతో బావుంది. దాని వెనక *tight emotion,* ధ్వనీ పలుకుతున్నాయి. చాలా చిన్నది.

పబ్లిషర్ కి రాశాను.

27 మార్చ్ 1956 శ్రీరమణాశ్రమమ్

చలం

...12...

చలం

వజీర్ రహ్మాన్ గారికి,

మీరట్లా నొచ్చుకోకూడదు. మిమ్మల్ని ఎరగనుకదూ, *personal* గా! అందుకని నా కలానికి కళ్ళెం వొదిలి దూకుడుగా రాశాను గావును. మీరు కవి అనీ, మీది సున్నితమైన కవి హృదయమనీ మరిచి. మీ టీచరు కోప్పడితే నొచ్చుకుంటారా? నేను రచయితనే కాదు— రచన నా *life product.* నేను *preacher* ని *teacher* ని, పుటకతో. ఎట్లాగైనా మనుషులకళ్ళు తెరుద్దామనే ఆవేశం ఉక్కిరి బిక్కిరి చేస్తుంది. *Personal* గా నేను తలుస్తుణ్ణి. నేనెవరికీ ఏదీ బోధించను. అడిగినా, మాటలురావు. కాని కలం చేత పట్టానా, మాటలు నా స్వాధీనం తప్పుతాయి. ఎట్లాగో నయానో భయానో, నాకు తెలిసిన సత్యం చెప్పాలనే ఆవేశం పూనుతుంది. అందువల్ల మీకు కష్టం కలిగించి వుంటాను. నా పుస్తకాలూ అంతే. వాటి ప్రారంభం సంస్కరణ, అంటే ఏదో చెప్పాలని. కాని నా రక్తంలో *art* వుంది. గావును, నా ప్రయత్నం అట్లా పరిణమించింది పుస్తకాల్లోని నా తిట్లు ఎంతమంది సహృదయుల్ని నానించి దూరం చేశాయో, మనిషిగా నన్ను ప్రేమించిన వారిని భయపెట్టాయో ఇంకా ఆ గుణం చావలేదు. నేను మీకు గట్టిగా రాశాను గావును.

అవును. పాపం. మీరు గట్టికష్టంలోంచే బైటపడ్డారు. కాకినాడలో నేను ఎన్నో ఏళ్ళకిందట, అట్లాంటి మధురమైన కష్టాలు పడ్డరోజులు జ్ఞాపకం వొస్తున్నాయి. నా మిత్రుల్ని పోలీసులు *arrest* చెయ్యడం కూడా జరిగింది.

మీ పరీక్షలు అయిపోయినాయా? ఏంచేస్తున్నారు?

ఎనభయ్ నాలుగు

*M. R. Row garu* విశాఖపట్నంజిల్లాలోంచి *Portrait of a genius* పంపారు. ఆ పుస్తకం పేరునించి, అనేక సమయాల్లో అతనికీ నాకు పోలికలు కనిపిస్తున్నాయి. నేను కథలు రాసే మొదటి రోజుల్లో ఎవరో మిత్రులు నా కథలు సరిగా లారెన్సు కథలమల్లే ఉన్నాయని రాశారు. ఆంత వరకు ఆ పేరు వినలేదు నేను. ఎన్నో ఏళ్ళు ప్రయత్నించాను. అతనిపుస్తకాలు దొరకలేదు. 1933 లో గావును దొరికాయి, ఒకటి, రెండు. తీరా చదివితే, నాకూ అతనికీ రాతలో ఏ పోలికా కనపళ్ళేదు నాకు. పైగా అవినాకు ఎక్కువ ఆకర్షంగానూ లేవు. అతని ఉత్తరాలు మొన్న మొన్న చదివిన తరవాత అతను కొంత అర్థమైనారు నాకు. ఈ పుస్తకంలో ఏం తెలుస్తుందో చూడాలి. తొరలో చదివి మీకు పంపేస్తాను.

ఆశ్రమంలో ఓ ఇంగ్లీషు ఆయన వున్నారు. ఆయన లారెన్సుని '*I detest his books*' అని తన దగ్గిర ఉన్న *Sons and Lovers* నాకు ఇచ్చేశారు.

మీ మనసులో ఏ కించా పెట్టుకోకండి నా విషయమై. ఎప్పుడూ మీరు నాకు ప్రియమైన సన్నిహితులే.

చలం బాగానే రాస్తాడు, కాని—

*Genius, but*- అని లారెన్సుని. ఆ 'కాని' లేకండా నన్ను గురించి మాట్లాడినవారు అరుదు. మొన్న నా మిత్రుడు దీక్షితులుగారు రాస్తున్నారు— ఓ రచయిత సంగతి— (తెనాలి, శారద) మీ సెక్సు గొడవ (అంటే పిచ్చి) అతనికి లేదు— అని. అట్లానే పాపం లారెన్సుని. దేశభక్తి పట్టవొచ్చు, డబ్బు పట్ట వొచ్చు. కీర్తి పట్టవొచ్చు. యాచకత్వం, లోభత్వం, నీచత్వం, ఇన్నీ పట్టవొచ్చు రచయితని. ఏమీ అనరు. *Sex* ఒకటే వీళ్ళకి పెనుభూతం. తెల్లారితే దొంగ చూపులతో ఏదో ఆడదాని కోసం వెతుక్కునే, చాటు దొంగల—

చూశారా, కలం ఎట్లాపరిగెత్తుతోందో! పాపం, ఆ లారెన్సు ఆ *sex* ని ఆరోగ్యవంతం చెయ్యాలని, అతని పరితాపం, మానవుడి మీది ప్రేమ. ఆ *sex* లోంచి అతను (మీళ్ళెవరూ కలలలో నన్నా చూడలేని) అందుకున్న అంతస్తులు— ఇవేమీ అక్ఖర్లేదు— *sex*— సెక్సు— రేడియో స్టేషన్‌లో—

ఇంక రాయను. ఇదో పుస్తకమౌతుంది.

లారెన్సుకీ నాకూపోలిక— *sex main subject* కావడమూ, ఇద్దరం, టీచర్లుం రొష్టుపడ్డాం, ఇద్దరం దేశంవొదిలి పోయినాము, ఇద్దరమూ పుటకతో పోటి శరీరాల వాళ్ళం, ఇద్దరి తండ్రులూ తాగుబోతులు— ఇద్దరికీ తండ్రి అంటే అసహ్యం— నాకు తల్లికూడా.

ఈమధ్యన ఓ *youthful* మిత్రుడు రాశాడు—

"రాత్రి నాతోవుండి తెల్లారేవెళ్ళిపోయింది. ఎంత *sweet*—" అంటో.

నేను దానికి రాశాను—

"ఓ రాత్రి నాతో గడిపిన స్త్రీని నేను తెల్లారి వెళ్ళనివ్వను. *That is my tragedy*" అని.

అట్లానే మీకు రాస్తున్నాను.

"నేను ఆమెని ప్రేమించినా, నాకు ఆమె *stranger* అయినాసరే, ఆ అమ్మాయి వొప్పుకుంటేనేగాని వాళ్ళ వాళ్ళని తీసుకుపోనీను, ఆ అమ్మాయిని."

నా జీవితంలో సుఖంలేకండా ధ్వంసం కావడానికి అదో కారణం.

ఎనభయ్ ఆరు

నా పరిస్థితులు వేరు. నా *make up* వేరు. ఆ మిత్రు దన్నట్లు— *that is why you are Chalam. I am P*—.

అతని *non-attachment* ని నేను *envy* చేస్తో రాశాను.

నాది వుత్త బంకపట్టు— ఒక్కొక్కప్పుడు ఉడుంపట్టు.

మళ్ళీ

మీ—

14 ఏప్రిల్ 1956 శ్రీరమణాశ్రమమ్

చలం

...13...

చలం

వజీర్ రహ్మాన్ గారికి,

మీకవరునీ, కాయితాన్నీ, వ్రాసేవిధాన్నీ చూసి, "ఇదేమిటి? ప్రియుల మధ్య లేఖమల్లే వుంది" అన్నారు ఈశ్వరుడు.

*Aldington* పుస్తకాంలో తప్ప నేను లారెన్సు గీతాల్ని ఇదివరకు శ్రద్ధగా చదవలేదు. మృత్యువుముందు అతను రాసిన గీతాలు ఎంతో గొప్పగా వున్నాయి. అతని శైలిలోగాని, పద్ధతిలో గాని, నాతో పోలిక నేను ఇదివరకు చూడనూ లేదు. *Biography* లో చాలా సామరస్యాలు కనపడుతున్నాయి. ఎన్నటికీ తృప్తి పడని అతని కలలూ, అతని అన్వేషణా. సమయం వొచ్చే టప్పటికి అతని మిత్రులనుకున్న వారందరూ అతన్ని వొది లెయ్యడమూ. కాని అతని వలె— మొత్తానికి అతనంతగా— నా మిత్రుల్ని *offend* చెయ్యను నేను. కాని అతని మిత్రులకు అతను *attractive* అయినట్టు నేను కాను. అట్లా *entertain* చెయ్యనూ లేను. *Aldington* లారెన్సు *heroes* తో అతన్ని *identify* చేసేవాళ్ళ లోపాల్ని అతనికి అంటకడతాడు. అదెంత వరకు న్యాయమో నేను చెప్పలేను.

ఈ తెలుగు కవులా! నండూరి సుబ్బారావు, శ్రీ శ్రీ, దీక్షితులు— ఇట్లాంటి ఏ నలుగుర్నో తప్పిస్తే, తక్కిన వాళ్ళని వర్ణించడానికి మీరు పదాలు వెతుక్కోవాలి. ఈ మధ్య విశ్వనాథ సత్యనారాయణగారు మంచిగా మారుతున్నారట.

వాళ్ళని ఎవరూ లోకంలో మెచ్చుకోక పోయినా, వాళ్ళు *auto- appreciation* ఇచ్చుకోవడంలో చాలా ప్రవీణులు.

నా కెప్పుడూ జీవితంలో నా *fans* తో గాని, *literary world* తో గాని సంబంధంలేదు. ఎవరన్నా వచ్చి బలవంతంగా నా చెవుల్లోకి నెడితేనేగాని, నన్ను గురించి ఏమనుకుంటున్నారో, ఏం రాస్తున్నారో, వినలేదు, చదవలేదు. నేను రాస్తున్న విషయాల్లో నేను చాలా *right* అనీ, ఈ రాతగాళ్ళల్లో నాకు చెప్పి నన్ను దిద్దడానికి సమర్థులు ఎవరూ లేరనీ ఎప్పుడూ తెలుసు నాకు.

నాకు తెలిసిన విమర్శలు ఉత్త తిట్లేగాని ఏ *argument* లేదు. ఈనాడు అసలు తెలీదు నాకు, లోకంలో ఏంజరుగుతోందో. పత్రికలు, *news-papers,* రేడియో ఏదీ వినను, చదవను. వాటి శబ్దాలు, వాక్యాలు, నాకు కడుపులో తిప్పుతాయి. *Interest* కూడా లేదు.

మీ గీతం *(Sulphur)* బావుంది. *But*— ఏంలేదు. *Fragmentary* గా వుంది. ముందు చిన్నముక్క రుచిచూపిన కోడికుర్మా మల్లే.

ఈ *inland covers* నాకు అసహ్యం— *but*--

8 మే 1956 శ్రీరమణాశ్రమమ్

చలం

వజీర్ రహ్మాన్ గారికి,

మీ ఉత్తరం. ఎన్నో సంగతులు రాయాలా వేరే మీరు! అన్నీ మీ అక్షరాల మధ్య పలుకుతోనే వుంటాయి. పుస్తకాలు, మిత్రులు, ప్రణాయాలు– వారికన్నా వారి *contact* వల్ల మనలో కలిగిన *reactions* ముఖ్యం. అవి మనలో *permanent*. అట్లాంటి లోతైన అనుభవాలు మన ప్రతి అక్షరంలో, మాటలో, చూపులో, *gesture* లో పలుకుతాయి. మీరు నన్ను ఇష్టపడుతున్నారంటే, నా అనుభవాలకి నే నెదురుపలికిన విధం నా రాతలలో మీకు వినపడుతోందన్న మాట. అట్లానే మీ ఉత్తరాలు నాకూ. మాట్లాడకుండా తెలుపగల వాతావరణం మన మధ్య ఏర్పడు తున్నప్పుడు, మాటలు అనవసరమౌతాయి. అందుకే అట్లా మీరు ఉత్తరాలలో మౌనులవుతారు. క్రమంగా ఉత్తరాలు రాయడం ఓ ఉద్దేశ్యంతో ఏదో తెలపడానికి కాక, మాటలు లేని రాగాలాపన మల్లే, ఉత్త రాగంతోనే మన భావాల్ని తెలియచేసే రసోద్రేక మౌతుంది లేఖ.

"ఎందుకు దయరాదురా" అనే వేదన, మాటలు లేకుండానే, రాగంతో చెప్పగల స్తితి, రాగం లేకుండా మౌనంతో చెప్పగల స్తితీ వొస్తుంది.

మీ ఉర్దూ గీతం బావుంది. దానికి నా *supplement* ఒకటి వుంది.

చాలా మంది మానవుల్ని అన్ని *elements* తోనూ చెయ్యలేదు. ఒక్క బురదతోనేచేశారు ఈశ్వరుడు, అదీ చాలాసార్లు

మురిగిన బురద— కాని ప్రతి ప్రతిమలోనూ, తనలోంచి ఒకరవ్వని పొదిగారు.

గీతం *full* కావడానికి దీర్ఘంకానఖ్ఖర్లేదు. ఎంత పొడుగ్గై కూడా *fragmentary* కావొచ్చు. ఇంకా ఏదో చెప్పబోతున్నారనీ, చెపితేనేగాని పూర్తికాదనే *feeling* వొచ్చిందన్నమాట. ఆ గీతం *(Sulphur)* చదివితే.

ఈనాటి ఇంగ్లీషు కవిత్వం నాకు అర్థంకాదు. *Illustrated weekly* లో పడతాయి పద్యాలు, అట్లాంటివి. అవి ఎక్కడా అందవునాకు. వంకర్లు తిప్పిగాని, నిగూఢంగా గాని ఏది చెప్పినా నాకు గిట్టదు. అది చీల్చుకునే *patience* నాకులేదు. కఠినమైన భాషవున్నా అంతే

మామూలుగా చిత్రంలో చెప్పలేని వాడికే *cubism.* ఆ *cubism* చెప్పేదేదో, మామూలు *painting* లోనూ చెప్ప వొచ్చు. చాతకాలేదు. అట్లాగే *surrealism.* చాలా పద్య గ్రంధాలన్నీ ఛందోబద్ధమైన వచనాలు. నేనంత ఇష్టపడే కృష్ణశాస్త్రి కవిత్వంతోనూ నాకు అదే తగాదా! అన్ని అర్థంగాని పదాలు అనవసరం. చాతగాని తనం. అందుకనే నండూరి సుబ్బారావు గారిని అంత పైకెత్తుతాను.

సర్రియలిస్టు పోకడలూ ఎక్కడో తప్ప నాకు సరిపడవు. ఉన్నదున్నట్టు చిత్రించడంలో నాకు సింపతీ లేదు. అందువల్ల మీరు రాసే వాటిల్లో నేను *worth* చూడలేక పోతున్నానేమో! *Modern influenc* మీలో గట్టిగా వుంది. అది తప్పనికాదు. దాన్ని *appreciate* చేసే *quality* నాలో లోపించిందని. అట్లానే సినీమా పాటలు— వాటిల్లో కవిత్వంగాని, సంగీతంగాని, ఏ మాత్రం నాకు సరిపడవు— ఎక్కడో తప్ప. నా చెవిని

తొంభయ్ ఒకటి

బాధిస్తాయి కూడా. ముఖేస్, తలత్, రఫీ— నాకు దుర్భరం. తలత్‌ని అనవొద్దని పకపక *protest* చేస్తోంది.

మంచికవిత్వం, మనలోంచి వొచ్చేప్పుడు—వొచ్చేస్తుంది. పొడుగా, పొట్టా, *fragmentary* ఆ. *economy of words*— ఇట్లాంటి ప్రశ్నలు రావు. అటువంటి *uncontrolled inspiration* వొచ్చిందాకా, మీవంటి రసజ్ఞులు ఏదీ రాయకూడదు. సరదాకి మీలో మీరు దాసుకుని చింపెయ్యండి.

కఠినంగా రాశాను. ఆ సూత్రమే నాకు నేను *apply* చేసుకుంటే, చాలా కత్తిరింపులు జరగాలి. కాని నా *ideal* అదీ.

నా జీవితంలో— అంతా కలిపితే, నేను ఇంకోరి ఇంట్లో (బంధువులూ, స్నేహితులూ కలిపి) ఓ పదిసార్లు దిగానేమో— అదీ ఒకటి రెండు రోజులు. తరవాత రోజుల్లో అసలు నన్ను ఎవరూ వాళ్ళ ఇళ్ళకి రానీనేలేదు. నండూరి, కృష్ణశాస్త్రీ, నేనూ, చిన్నప్పటినించి ఎరిగి వున్నవాళ్ళం— ఓ *college etc.* ఏడేళ్ళ కిందట— నేనింక తెలుగు దేశాన్ని వొదులుతాననగా— సుబ్బారావు గారి ఇంటికి వెళ్ళి, జీవితంలో మొదటిసారి, "నన్ను మీ ఇంట్లో 3 రోజులు వుండనిచ్చి, భోజనం పెడతారా?" అని అడిగాను. మొదటి రాత్రే గావును, ఇద్దరమూ ఆ ఏటి ఒడ్డికి వెళ్ళాము— చీకటి రాత్రి—

'ఏటి కడుపున దాగి
తోట నిదరోయింది—'

ఆ విమలా అమీనా—ఇద్దరి జ్ఞాపకాలతో పులకరిస్తున్న ఆఏటినొడ్డుకి.

'ఈరేయి నన్నొల్లనేరవా, రాజా' అన్న పాటని సుబ్బారావు రాసిన ఏటి వొడ్డు. కాని ఈసారి మిణుగురుపురుగుల మామిడి చెట్టు కిందికి కాదు—

తనకొత్త గీతాన్ని వినిపించారు సుబ్బారావుగారు. కయ్ కుయ్ అనకండా అన్నీ విన్నాను చీకట్లో. చీకట్లో మొహం కనపడలేదు కవికి. కనపడితే ఎప్పుడో ఆపేశేవాడు. అన్నీ విని, మళ్ళీ చదవమన్నాను. మొదటి పాటకే, "ఈ పాట నా కర్థం కావటంలేదు. అర్థం చెప్ప" మన్నాను. చెప్పారు. "మీరు చెప్పే అర్థం ఈ పాట మాటల్లోంచి ఎట్లావొస్తుందో చూపండి" అన్నాను. తబ్బిబ్బు పడ్డారు. నేనన్నాను. "కవిత్వమైతే ఇట్లా రాయవొచ్చు. పుస్తకం ఎదట పెట్టుకుని పగల కొట్టుకుంటాము. కాని పాట, వినేది. వింటో వుంటే అర్థం కావాలి" అన్నాను. అతను ఈ పాటల్ని మెచ్చుకున్న రాజమన్నారు, జడ్జి మొదలైన పేర్లు చెప్పాడు. నేను, "ఆ మాట అనే ధైర్యం లేదు వాళ్ళకి. ఈ కొత్త పాటలు ఎందుకూ కొరగావు. గొప్ప *attempt* చేశారు. పదాల మీద మీ ప్రతిభ, *economy, happy phrasealogy-* ఇవన్నీ వున్నాయి. బాగా *practice* అయిన చెయ్యి. మీ *workmanship* అంతా వుంది. కవిత్వం చచ్చింది" అన్నాను.

నా "పురూరవ" ని తలుచుకుని తలుచుకుని సుబ్బారావు మూర్ఛలు పోతున్న రోజులు— అవి. అతన్ని *poet in a hundred centuries* అన్నవాణ్ణి నేను. కాని నిజంచెప్పాలి. కాకపోతే అతని మిత్రుణ్ణి ఎట్లా అవుతాను? ఇవన్నీ అని అతని అతిధిగా రెండు రోజులుండి, మళ్ళీ పాడి వినిపించినా, మళ్ళీ ఈ మాటలే అని వొచ్చేశాను. తరవాత అతని మొహాన అతని కొత్త పాటల్ని మెచ్చుకున్న కవిమిత్రుల్ని, ఆ పాటలకి అర్థమేమిటని అడిగి, వాళ్ళు '*cowards*' అని వాళ్ళకి తెలిసేట్టు చేశాను.

నేను అనుకోకండా రాసింది నిజమయింది. ఆ ఏటివొడ్డున పాట అతనికి *swan song* అయింది. ఈ కొత్త పాటల్లో కూడా అక్కడక్కడ *brilliant lines* వున్నాయి.

మీరు రాసిన పర్షియన్ గీతాలు బావున్నాయి. ఎంకిపాటల మల్లేనే, ఈ భావాలు అసలుకవి మాటల్లో పాడితే తప్ప, భాష మార్చామా, వాటిఅందం ఏమాత్రమూస్ఫురించదు. గొప్పకవిత్వం లక్షణమది. ఇట్లాంటి గీతాల్ని నామిత్రుడు ఏలూరు కాజీ సాహెబు గారు పాడి వినిపించేవారు.

ఇక విమర్శ—

*Sentiments* అన్నిటినీ నరకడమే పనిగా గడిపాను జీవితం—మాటలో, రాతలో—ఎన్నిహృదయాల్ని, నన్నుప్రేమించే హృదయాల్ని గాయంచేశానో. ఎక్కడ *sentiment* కనపడ్డా నాలో నేను నరుక్కున్నాను. కాని ఈనాడుచూసుకుంటే నా *sentiments* నాకు వుండనే వున్నాయి. ఎదిరించి, వూరికే *wound* చెయ్యడానికే, వాళ్ళ బూతులనేవి, అప్రస్తుతంగా కూడా అతికించాను నా కథల్లో. కాని జన్మ జన్మలనించి శృంగారం నారక్తాన ఇంకి వుండడంచేత వాటికో అందాన్నే ఇచ్చింది కవితాదేవి. ఇన్ని రాసినవాణ్ణి, కొంచెం హద్దు తప్పిన శృంగారాన్ని భరించలేను. "నాకేనా హద్దు మీరడానికి హక్కు?" అని నవ్వుకుంటాను. కాని భరించలేను.

"నా స్తనాలదిమిచూడు"

అని చదివితే, వికారపెడుతుంది. కాయితంమీదనేకాదు. ఏ స్త్రీ అన్నా ఆ మాటలంటే దూరమైపోతాను. ఆ మాటలు అనే సమయాలు వున్నాయి. అప్పుడు అనే విధంవేరు. ఇక్కడ సరిపోవటంలేదు. ఆ సమయాన్ని కవిత్వంలోకి తీసుకు రావడం దోషం. నిగూఢం, పవిత్రం.

నేను రాసేది నా సొంత *idiosmcrasy*. దీనికే అధారమూ లేదు.

ఇదంతా ఎందుకు రాస్తున్నాను? ఇంకోరికి రాయను, నాకో గురుపీఠం ఇచ్చి, దానిపైకి ఎక్కించి, "కానీ—మాట్లాడు" అన్నవాళ్ళముందు గాక.

ఆ *line* తప్ప 'హారతి' అనే గీతం ఎంతో బావుంది.

"నీకై వేచిన కోరలు." ఆకోరలు కరుకుగావుంది— అంత మెత్తటి గీతంలో.

"నీకై నేతెచ్చిన కలువపూలు *etc*"-ఎంతో గొప్పగావుంది.

ఇంకా "నీపూజకై తెచ్చిన" అంటే—ఆ భావం వొచ్చేట్టు— ఇంకా ఎంత గొప్పగా వుంటుందో!

మళ్ళీ జ్ఞాపకం చేస్తున్నా. ఏకారణమూ, ఆధారమూ లేని *personal tastes* ఇవన్నీ.

చాలా బావుంది 'హారతి'.

ఇంక రెండోది— *(sulphur)*

గీతానికీ, హైటిల్‌కీ సంబంధం కనపడదు.

ఈ రెండు మీ గీతాలో, లేక ఏ దన్నా ఆధారం పెట్టుకుని చేశారో తెలీదు— కాని నా విమర్శ విమర్శే—

ఈగీతం (మృత్యువు) చాలా గొప్పగావుంది—ప్రతిమాటా.

"ఇలా, అకస్మాత్తుగా ఆపేశారేం పాట—" ఎంతగొప్ప భావమో— ఈ *idea* ని *feel* అయిన హృదయం, ఎంతలోతో!

ఈశ్వరుడెంత సన్నిహితమో! కవిత్వంలో స్పృశిస్తున్నాడు అంతర్యామి పాదాల్ని— టాగూరు మల్లే— అంతకన్న గొప్పగా!

"ఏంచేశాడీ పాప!"

గుండెని కోస్తోంది!

ఈ కవిత్వం పైకి నాలో పలకక పోయినా, గుడ్డి ఆకాశం కేసి చేతులెత్తి, నాజీవితంలో కొన్నేళ్ళు, ప్రతిదినమూ, ప్రతిరాత్రీ, అట్లా ప్రశ్నించాను, ఏమీలేని శూన్యాన్ని. ఆపాదం చదివి ఈనాడు అనుభవిస్తున్నాను. ఆ బాధనంతా ఇంకోసారి!

ఎంతో గొప్పగా వుంది.

అన్నీ ఉత్త మామూలు మాటలే. వాటిలోకి ఎంతగొప్ప వేదనని— సృష్టి అనాదిగా, అంతంవరకూ, ఎప్పుడూ రక్తంకారే ఆ రుద్రమూర్తి చేతుల్లోని కత్తెరని, సాక్షాత్కరింప చేశారు—

ఇంకేం రాయను?

19 మే 1956 శ్రీరమణాశ్రమమ్

చలం



చలం

వజీర్ రహ్మాన్ గారికి,

మీ ఉత్తరం. నేను నిన్ననే పెద్ద ఉత్తరం పోస్టు చేశాను మీకు. అందే వుంటుంది.

ఈ ఉత్తరంలో నేను మీకు జవాబు రాయవలసింది ఏమీ లేదు. కాని మనుషుల్ని, వారి వర్తననీ, కళ్ళు తెరిచి ఓ సారి చూసి, తెలుసుకుని, వెంటనే నాకు రాశారంటే, మీకు నే నెంత దగ్గిర ఔతున్నానా; అని సంతోషించాను.

మనుషులు అంతే. ముఖ్యం— (1) నాటకాలవాళ్ళు (2) పత్రికలవాళ్ళు (3) పబ్లిషర్లు (4) రేడియో (5) అన్నిటి కన్న సినిమావాళ్ళు--

వీళ్ళు ఘోరం— చివరివారి యడల దగా అన్నమాట చాల స్వల్పమైనది. దగాని ఓ వెయ్యి పెట్టి గుణించండి— కాదు, దగా 1000— *raised to the power of a thousand.* డబ్బుకేగాక స్త్రీల కోసం దగా. ఈ *publishers* అనే వాళ్ళు తప్ప తక్కిన వాళ్ళనించి దూరమైన నా జీవితం ధన్యం— అంతవరకు. *so far.*

నేను నాటకాలు వేసినపుడూ, అందరూ నావాళ్ళు, నా పిల్లలు, నా *students,* దగ్గిర మిత్రులు— సరదాకి వేశాం! ఎవరూ దాంట్లోకి డబ్బుకి కాదు— వీలైతే డబ్బు నష్టానికి చేరిన వాళ్ళు ఒకరిద్దరూ డబ్బు చేసుకున్నారు— కాని వీరికి ఆ డబ్బు చేసుకుంటే, మాకు నవ్వు— నాటకాలనించి డబ్బు చేసుకున్న దౌర్భాగ్యుణ్ణిచూసి.

తొంభయ్ ఏడు

మిమల్ని ఇట్లా దగా చేసినవాళ్ళలోనే ఇంకో వేపున ధాతృత్వం, స్నేహం, *even honerty,* స్వార్థత్యాగం కూడా తీయకువుంటో వుంటుంది. అందుకనే ఎక్కడా, ఏవిధంగానూ ఏమీ *judge* చెయ్యలేము. లోకంలో వుండే *zones* లో ఒకటయిన దగా *zone* లో ప్రవేశించారు కొంతకాలం. మళ్ళీ మీ కవిత్వపు *zone* లోకి పోయి కుభ్రంకండి.

పాపం, 'ఏమిటీలోకం!' అని గుడ్లు అట్లా నిలిపి చూసే కుర్రాడి మల్లే వుంది మీ లేఖస్వరూపం.

ఆవొచ్చిన బహుమానాలు, న్యాయంగానే సంపాయించారో, ఎలా సంపాయించారో, ఆలోచించాలి. అందువల్లనే మీకు *grateful* గా *feel* కారు. ఈ *conpetitions,* ఈ ఉద్యోగాలు, ఈ ప్రభుత్వాలు అన్నీ *rotten. But they are not so rotten as they could be.* అదొకటే వాటి *merit.*

పాపం, మీరు *shell* లోంచి బైటికి తొంగిచూసి, పక్కన కాచుకునివున్న *vultures* వల్ల గాయపడ్డట్టున్నారు.

22 మే 1956 శ్రీరమణాశ్రమమ్

చలం

**...16...**

చలం

వజీర్ రహ్మాన్ గారికి,

మీరు రాసి పంపిన గీతాలన్నీ ఎంతో బావున్నాయి.

*Thanks.*

24 మే 1956 శ్రీరమణాశ్రమమ్

చలం

...17...

చలం

వజీర్ రహ్మాన్ గారికి,

మీ రెండు ఉత్తరాలు. వొళ్ళు బాగాలేదు. అందుకని సరిగా రాయలేను ప్రస్తుతానికి.

షా తనకి *Black Girl- divine inspiration* అనడం నాకు చిత్రంగావుంది.

"ఈశ్వరుడు నా చేత రాయించారు"— అనే వాక్యం ఏ సందర్భంలో రాశానో మీరు తెలియచేస్తే, మీకు సరైన సందర్భంలో రాయగలను. ఆ విషయమై నేను మీకు తెలియచేసు వలసిన విషయాలు ఉండనే వున్నాయి.

ఇంక రెండో వుత్తరం. నేను కవులను గురించి అంతా తీసెయ్యాలనికాదు. విమర్శా, *incidents* ఏమన్నా వుంటే అవీ అట్లానే వుంటాయి. నా కలం జోరులో రాసేస్తాను, అనవసరంగా వాళ్ళని బాధపెట్టేవి. వాటిని కొంచెం దిద్దితే నాకు శాంతంగా వుంటుంది. కనక ఆ *concerned letters* లో *concerned* భాగాలు మీరు పంపించగలిగితే, ఒక్కసారి చూస్తాను. ఒక్కరోజే నాదగ్గర పెట్టుకుంటాను, ఉత్తరాల్ని.

ఇంక రాయలేను.

అదీకాక, చిన్నప్పటిమిత్రుడు గుంటూరినించి వొచ్చాడు. అతను నా *attention demand* చేస్తున్నాడు.

మీ మూడోకవరు ఇవాళ.

నూరు

ఆ రెండు ఉత్తరాలూ ఒక్కసారి పంపండి. నా మనశ్శాంతి కోసం.

కవుల కాకిగోలా? నాకవిత్వాన్ని చూసికాదు, మీ ఈలల్ని చూసి ఐవుంటుంది.

కవుల కాకిగోల తలచుకుంటే, నాకు కొత్త ఉత్సాహం పుడుతోంది.

4 జూన్ 1956 శ్రీరమణాశ్రమమ్

చలం

...18...

చలం

వజీర్ రహ్మాన్ గారికి,

మీ ఉత్తరం. ఆ ఉత్తరాన్నే తిరిగి పంపుతున్నాను. కొట్టేసినభాగాలు ప్రచురించకండి. అవి ప్రచురిస్తున్నారంటే, నాకు బాధగా వుండేది.

ఇవాళ నాకు పడుకుని అసలు లేవాలనిలేదు. జబ్బు ఏం లేదు. కాని ఏ పనీ చెయ్యలేను. తప్పనిసరికింద మీకు రాస్తున్నాను. కనక వివరంగా రాయలేను. ఆలోచనలూ రావు. తలకూడ రాయిలాగుంది.

కొట్టివేసిన భాగాలు—మిమల్ని నిరుత్సాహ పరచడం నాకు బాధై, నేనైతే కొంతవరకన్నా లొంగిపోదును. రహ్మాన్‌గారి కన్న ఆ కవులు బాధ పడడమే నయమని కాని వాటి విషయమై నాకు వొచ్చినది *order from High*. నేను *obey* చెయ్యక తప్పదు.

మీ *point* నాకు బాగా అర్థమౌతోంది. కాని దానికోసం, నాలో ఉన్నతమైన భాగాన్ని నేను తీసేసుకోలేను. పూర్వమైతే దూకేవాణ్ణి ఇప్పుడు మారినట్టున్నాను.

ఇంకోటి, మీరు రాసిన వాటిలో *A* లో విశ్వనాధ సత్యనారాయణగారి సంగతి తరవాత, మీరు రాసిన నాకు పేర్లు తెలీని కవుల సంగతి— సత్యన్నారాయణగార్ని కాదు. ఆ రెండు వాక్యాల్నీ ఒకచోట జేర్చకండి. సత్యన్నారాయణగార్ని మెచ్చు కునేవారు ఈనాడు ఎన్నివేలో! నిలబడి, బతికి, ఇంకా రాస్తున్న కవి ఆయన వొక్కరే.

ఆ ముగ్గురు కవులలోనూ కవిత్వం ఎప్పుడో ఎండింది. ఆ సంగతి వాళ్ళకే తెలుసును. ఇంక నేను వేరే చెప్పి బాధ పెట్టడమెందుకు వాళ్ళని! పైగా వాళ్ళలో శ్రీ శ్రీ, సుబ్బారావు ఈనాటికీ నాకు ప్రియులు. మనుషులకింద నాకు విలవగలవారు. కవిత్వదేవత ఓవరంకింద మనపైని కటాక్షించిందికదా అని, దాన్ని మన వుద్దేశ్యాలకీ, అవసరాలకీ, వ్యాపారాలకీ, కీర్తికీ ఉపయోగించు కోచూస్తే, ఆ దేవి ఆగ్రహిస్తుంది. ఆమెని నీచపరిచినకొద్దీ, మహామంత్రంవలె, తన పూర్వపు భక్తుణ్ణి నెత్తికొడుతుంది. కాని ఆమెనే నమ్మి ఆరాధించి, ఆమెనించి ఏదీ కోరక, పోతనవలె ఆమెకి అర్పించాడా, అతనికై ఏ స్వర్గవీధుల ద్వారాలు తెరుస్తుందో ఊహించలేరు. ఈ ముగ్గురిలో గొప్ప దోషం చేసినవారు కృష్ణ శాస్త్రిగారు.

నేనిప్పుడు అచ్చులోకి రానీకండా ఆపుచేసిన వాక్యాలు అద్భుతంగా పడ్డాయి. అవి నిజం. వాటిని మనిద్దరి మధ్యమాత్రమే ఇంకిపోనీడం నాకు దిగులేస్తోంది. కాని............రాశానుకాదూ?

కావలిస్తే ఈ ఉత్తరం అచ్చువేసుకోండి.

9 జూన్ 1956 శ్రీరమణాశ్రమమ్

చలం

...19...

చలం

వజీర్ రహ్మాన్ గారికి,

మీ ఉత్తరం. నా విభూది పుత్తరం అందివుంటుంది. రాతలో *inspiration* న్ని గురించి మీరు రాసినప్పుడు నా తల్లోకి మంచి జవాబు వొచ్చింది. అప్పుడు రాయడం పడలేదు. ఇప్పుడు ఎగిరి పోయింది. జవాబు రాస్తున్నాను. కాని "*inspired*" గా వుండదేమో.

ఈ వూరు వొచ్చాకనే, అయిదేళ్ళనించే ఈశ్వరుడు నాకు. అంతవరకు ఏదీ ఈశ్వరుడికి అంటకట్టేవాణ్ణికాదు.

మొదట్లో నాకూ సారస్వతానికీ సంబంధం లేదు. నేను చూస్తున్న అన్యాయాలవల్లా, ఘోరం వల్లా నేను మండి పోయాను. ఆ మంట నాలో ఇమడక కథలయింది. నేనో రచకుణ్ణి కావాలనే ఆశలేదు. నేను రాసిందానికి రసప్రపంచంలో ఓ విలవ వుందనీ తెలీదు. మొదటి కథనించి నా పాఠకులు బిగ్గరగా ఏడ్పులు ప్రారంభించారు. ఆఏడ్పులే నా ఉత్సాహం. ఆ నెయ్యి నామంటలో పడి భగ్గుమని, ఇంకొక ధ్వని పుట్టించేది.

'చిత్రాంగి' రాశాను. మూడు రోజులు కాలేజీకి శలవ. నా గుమ్మంలో గోదావరి నీళ్ళు. ఇంట్లో వొంటరిగాణ్ణి. మూడు రోజులూ నేను తిన్నాననే స్పృహలేదు. చిత్రాంగి సారంగధరులతో బతికాను. వాళ్ళు నా పక్కన కూచున్నారు. తయారయింది, మూడోనాడు అర్ధరాత్రికి. వెంటనే మైలున్నరనడిచి చింతా దీక్షితులు గారి ఇంటికి వెళ్ళి వినిపించాను నా నాటకం. సారస్వతంతో ఏ సంబంధంలేని అయన భార్య మొదటి ముక్కలు వినడంతో,

పక్కమీదనించి లేచి వొచ్చి, తానూవింది. చివరవరకు. అదీ *inspired writing*. దానినే నే నిప్పుడు ఈశ్వరుడు రాయించా రంటాను. నేను యోచించలేదు. ఎట్లా రాద్దామా అని ఆగలేదు. అంతా అట్లా వొచ్చింది. ఎవరో రాస్తున్నట్లు జరిగింది నా కలం. రాయించింది చిత్రాంగి అనుకున్నాను అప్పుడు. ఇప్పుడీశ్వరు డంటాను.

"మాకధరాయి" అని చిత్రాంగి సారంగధరులన్నట్టు ఉంది.

చాలాసార్లు నా కధలు చదివి, ఎవరో వొచ్చి. ఎట్లా" తెలుసునండీ మీకు?" అని,అట్లాంటిది వాళ్ళ ఎరుకలో జరిగినట్టు చెప్పేవారు. నే నెరగని ప్రదేశాలు వర్ణిస్తే, అక్కడ అట్లాగే వుంటుంది అని చెప్పేవారు. ఈశ్వరుడు చెప్పారు— నేను మార్చిన పురాణగాధలలో కొన్ని ఘట్టాలూ, పాత్రలు, అసలు జరగడం— పురాణాలకన్న, నేను రాసినవి నిజానికి ఎక్కువ దగ్గిర అనీ—కాని నేను నిజానికి విరుద్ధంగా రాసినవీ ఉన్న భాగాలు చూపారు.

పూర్వ కవులు తమకి కలలలో ఏ శ్రీరాముడో కనపడి "ఈ కావ్యం రాయి" అన్నాడని రాశారే—అట్లా రాసుకోవడం వుత్త *fashion* కాకముందు— అసలు నిజంగా కనపడ్డప్పుడు, వాళ్ళ *poetic inspiration* ఆ రూపంలో కనపడేదనుకునేవాణ్ణి. కాని ఈనాడు తెలుసు నిజంగా కనపడ్డారని— ఆ దేవుళ్ళు వుంటేనేం ఆరూపంలో, లేకపోతేనేం?

ఎవరికైనాసరే, వాళ్ళ ప్రయత్నం లేకండానే, ఎట్లా వొచ్చిందో, *source* కనిపెట్టలేనంత నిగూఢంగా, *in spite of thier lethargy,* చీల్చుకుని ఏమన్నా వొస్తే, అది ఈశ్వరుడు రాయించింది. ఈనాడు సైకాలజీ దాన్ని *ont of the inner conscious* అంటుంది. ఈనాడు ఇక్కడజరుగుతోంది, కవిత్వంతో

ఏ సంబంధంలేని వాళ్ళలోంచి, భగవాన్ పైన అద్భుతమైన కవిత్వం వాస్తోంది. అకస్మాత్తుగా కొన్ని వారాలు వాస్తుంది, ఆగుతుంది— ఇంక ఒక్కలైనూ రాయలేరు. భగవాన్ పైన తప్ప ఇంకో దానిపైన రాయలేరు. వాళ్ళలోంచి అద్భుతంగా *fountains* పుట్టుకొస్తున్నాయి.

ఈనాటికీ *Jesus,* కృష్ణుడూ, ఎట్లా కొత్తరసపు కవిత్వాన్ని *inspire* చేస్తున్నారో! అవి వాంగ్మయంలోకి రావు.

ఎంకిపాటలు చూడండి. పీఠిక చదవండి.

"గుండె గొంతులోన కొట్టాడతాదీ!" అనే పాదం సుబ్బారావు గొంతుకలో కోట్టాడగానే, పైనించి కొత్త కవిత్వకన్య దిగి వొచ్చింది భూమికి.

"అగ్గి సూస్తాది" అనగానే పాత చెత్తకంతా అగ్గి ముట్టించింది.

ఈ విధంగా *inspire* అయివొచ్చిన *art* కి ఓ గొప్ప లక్షణం వుంటుంది. వాటి పుటక ఆ లోకంలో— ఈశ్వర పాదాల కిందనించి. గంగవలె దిగుతాయి, లోకాన్ని పవిత్రం చెయ్యడానికి, సారస్వత పాపాల్ని కరిగించేస్తో, తుక్కు కవిత్వాన్ని ముంచి మాడ్చేస్తో. అందువల్ల ఆ *writing* కి గాని *music* కి గాని ఆ లోకపు విశాలత్వం పడుతుంది. ఆ ప్రవాహాన్ని ఏదీ ఆపలేదు. ఇదేదో కొంపలు ముంచేది బయలు దేరిందని, గుండెలు దడ దడ మంటాయి, సారస్వతాధికారులకి; జీసస్‌ని చూడగానే గుండెలు గడగడ లాడాయి *Pharasites* కి, మహమ్మద్‌ని చూసి ఎంత విరోధం నిష్కారణంగా!

ఆ రచనలకి స్వర్గవాయు విశాలత్వం, ఉగ్రత పడతాయి. కొణకళ్ళ వెంకటరత్నంగారు పాడారు—

"చుక్కలన్నీ కొండమీద

సోకు చేసుకునే వేళ—"

గొప్ప కవిత్వం—ఆ అందమూ, ఆ నాజూకూ. కాని ఎంకిపాటల దేవత్వం ఏదీ వాటికి!

నా కథల ఆకర్షణ, *inevitableness,* బలం, ఎక్కడ వుందని చాలామంది వెతికారు. శైలి అనే వాటిని వల్లన వేశారు.

వాటి విశాలత్వం ఈ లోకంది కాదు, అన్నిటికీ కాదు, అంతకీ కాదు. మామూలుగా ఇద్దరి ప్రేమే—కాని నా కలంలోంచి వొచ్చిందా, అది పెద్ద *orchestra* తో బైలుదేరుతుంది. మామూలు వ్యభిచారంకాదు వాళ్ళు చేశేది. వీళ్ళ మనసు వాళ్ళని అసహ్యించు కుంటుంది. కాని వాళ్ళిద్దరి కాళ్ళూ ఈ భూమిని దాటి తేలుతో వుంటాయి, వీళ్ళ నెత్తిమీద. వారి శృంగారాన్ని ఏంచేసినా నీచపు *level* కి దించలేరు. అదే వీళ్ళ కోపం నా మీద. ఆ కథనే ఇంకోడు రాస్తే, మామూలు గొందులు దూరడం, ఓ మూల చేరడం అవుతుంది. అట్లాగే ఎంకి ఏంచెయ్యనీ, ఏమననీ, ఆమె వెనక శృంగార దేవతలు కంఠాలు కలుపుతారు.

"పచ్చన్ని చేలోకి పండు వెన్నెల్లోన—" ఎంకి వొస్తే, ఎవత్తో ఇంటోంచి దొంగతనంగా పోలేదు— ఏ కాపుదో, ఏ పాలి వాణ్ణో మరిగి—

గొల్లరాధ, గొల్లకిష్టుడికోసం బైలుదేరిన, హృదయనాథుడి కోసం బైలుదేరిన భక్తి హృదయపు *attraction of universal forces, soul calling to soul in eternity on the spiritual plane.* ఆ *quality* పట్టింది కవిత్వానికి, ఎంకి పాటల్లో.

అందువల్లనే దాన్ని వొదలలేరు, మింగలేరు.

ఇట్లాంటి *rebellion* లేకండానే కృష్ణశాస్త్రి కవిత్వాన్ని పట్టింది ఈగుణం. ఏకారణంలేకండానే, కవిత్వపు రోజుల్లో కృష్ణశాస్త్రిగారిని చూసి కవులకి ఎంత కోపం!

మొదటి అక్షరం చదవడంతో తెలుస్తుంది. కొత్త ప్రవంతి బైలుదేరిందని.

చిన్నప్పుడు నామిత్రులు సుబ్బారావూ, కృష్ణశాస్త్రీ. కాని వాళ్ళు రాసిన మొదటిపంక్తి చదవగానే కళ్ళుతెరిచి చూశాను, వీళ్ళిద్దరూ నేను ఎరిగిన నామిత్రులేనా? అని.

ఇంకా క్రిష్ణశాస్త్రి చిత్రికలు పెడతారు. కాని నావీ, సుబ్బారావువీ, *raw, unpolished. Straight from the Divine Heart.* నేను రాసేప్పుడు, ఎప్పుడూ, ఎన్నడూ పదాల్కి వెతుక్కోలేదు. రాస్తున్నాను అనే *consciousness* వుండదు. చాలాసార్లు ఉత్తరాలలోకూడా. నాకు భాష తెలీదు. వుత్తప్పుడు రాయడమంటే ఒక్కముక్క సరిగ్గా రాయలేను. నేను మామూలుగా రాసేదానికీ, *enspired* గా రాసేదానికీ అంత వ్యత్యాసం. కొన్ని నేను రాసినవి అంత చచ్చుగా వుండడం అందుకే. అంటే చలం రాశాడు—అసలుభాషని తలుచుకోని వాడి భాషకి అంతబలం పట్టింది. పాటవరసల్ని తలుచుకోనిసుబ్బారావుకి అంత సంగీతం పట్టింది.

కథ ఇట్లా నడిపిద్దామని అనుకోను — నాకు తెలీదు నడిపించాలన్నా. పాత్రల్ని కాయితంపై పెట్టగానే, వాళ్లే నడిపించుకుంటారు కథని. వాళ్ళు బతుకుతారు. పూర్తి చేసుకుంటారు. అందుకనే నా *theories* కి విరుద్ధంగా వుంటాయి నేను రాసేవి చాలసార్లు.

ఆ 'యశోదాగీతాలు', మొదలైనవీ అంతే. కొన్నాళ్ళు పొద్దున్నే లేచేప్పటికి-కాయితంముందు కూచోడమూ, కలం వాటిని రాయడమూ సంభవించింది. ఈనాడు ఇంక రాయలేను.

ఈనాడు స్పష్టం. ఈశ్వరుడు 'వ్రాయి' అంటే అది రాయబడుతుంది. అనకపోతే రాత అసలు రాదు.

చూశారా, ఇక్కడ ఆగింది. నన్ను కొయ్యంది. ఇంక ఒక వాక్యం రాదు.........

ఏటివొడ్డుకి తీసికెళ్లాను సుబ్బారావుని-'ఈరేయి నన్నొల్ల నేరవా రాజా' అన్నాడు. పది నిమిషాల్లో ఒక *immortal song* తయారయ్యింది నాకళ్ళముందు.

'ఏటికడుపున దాగి
తోట నిదరోయింది'

మాముందు నిద్రపోతోంది, విమలబోర్డింగుతోట- కాని ఆతోట, పాటలో తోటకాదు- నందనవనం - ఆకాశగంగలో ప్రతిఫలించింది.

'ఒక్కతెను నాకేల
వోపజాలని సుఖము?'

ఎన్నికోట్ల కంఠాల విరహాన్ని కలిపి పలికాడో! ప్రబంధకన్యల విరహాలన్నీ కలిపి తెచ్చినా ఎంకి గోరుకొనకి చేరువగా రాలేరు.

మళ్ళీ వాడిన మాటలేమిటి? వొక్కత్తె, సుఖమూ, నాకేల? వీటిల్లో ఆ బలం, ఆ విషాదం! ఎట్లా పలికాయి ఆ లోతులు?

మళ్ళీ మీ ఉత్తరం. అవును. డాక్టర్లకి అన్నిలోపాలూ వున్నాయి. కాని ఈశ్వరుణ్ణీ, ప్రకృతినీ తప్పిస్తే వాళ్లేకదా శరణ్యం.

మాట తొమ్మిది

ఈశ్వరుడే మనకి వైద్యుడు కావాలంటే విశ్వాసం కావాలి, ప్రకృతి కావాలంటే మన ఇంద్రియాల్ని కట్టుకోవాలి. ఈ రెండూ చాలా దూరం మనకి. కనక డాక్టర్లే శరణ్యం.

*Disappointments* మీకు ఉపకారమే చేసినట్టున్నాయి. ఈ జబ్బు కలకత్తాలోనో, మద్రాసులోనో చేస్తే!

ఈవాళే మీకాలేజీ *lecturer* వొచ్చి వెళ్ళారు మాఇంటికి. ఆయనా తొందర పడుతున్నారు. 25 న కాలేజీ తెరుస్తారని.

బుద్ధుడు పుట్టిన వైశాఖపౌర్ణమినాడే నేనూ పుట్టాను. కనక ఆఉత్సవాల గౌరవంలో కొంత నేనూ లాక్కుంటాను.

బుద్ధజయంతి గోలలు ఇక్కడేమీ వినరావు. అరవలు అట్లాంటి వెర్రిపనులు చెయ్యరు. చేసినా ఊరు ఎంతో దూరం మాప్రదేశానికి. రేడియో వుంది. వినము. పత్రికలూ, దినపత్రికలూ ఇక్కడికి రావు. వొచ్చినా చదవం.

బుద్ధుడి అడావిడి సంగతి విన్నాం. ఓరోజు ఆశ్రమంలో హిందువులమధ్య అంటున్నారు.—అనే ఆయన—

*"They are advertising poor Buddha. It is all a political stunt. He was not born in India. They refused his religion, and persecuted his desciples. He is not known here."* ఈ విధంగా మాట్లాడి, చివరికి—' *"You can plainly see that geographically, culturally and religiously Kashmir belongs to Pakistan."*

ఇంకా ఇంగ్లీషు బుద్ధి పోలేదవి లేచిపోయినారు వినేవాళ్ళు.

మీరు పంపిన పుస్తకమూ అందింది. అది *hard nut* లాగుంది చూడగా. చదవాలని చూస్తాను. మెదడుని *exhaust*

చేసే పుస్తకాలు చదవాలిఅనే *mood*లో లేను. కాని—.

అవును. కవుల సంగతి మీరు రాసేది నిజమే. నండూరి సుబ్బారావు వేరు. నానించి ముఖ్యం, ఏమీ భరించలేరు.

నీడ్షీ పేరు విన్నాను. అతన్ని గురించి మీరు రాసిన సంగతులు గొప్పగా వున్నాయి.

మీ మిత్రుల ప్రశ్నలకి జవాబు.

బెజవాడలో బడిలేని రోజుల్లో చలం ఏంచేస్తూవుండేవాడో, అదే అరుణాచలంలో చేస్తున్నాడు. బెజవాడలో ఏంచేస్తో వుండే వాడో తెలీదు. ఇప్పుడెట్లా తెలుస్తుంది.

ఉత్తరాలు రాస్తాడు. కొంచెం *literary work*. తనపిల్లలకి పాఠాలు, అందరూ కలిసి పుస్తకాలు చదువుకోడం, డాలీతో కిట్టూతో ఆడుకోడం, భజన, సాధన— టైం చాలటంలేదు. తోట-ఆవులు— వంట సరదాకి.

మీరు రాసిపంపిన (సుబ్బారావుగారికొత్త) ఎంకి పాట. నాకేం అర్థం కావడంలేదు తల చీల్చుకోవాలనిలేదు.

మీ ఇంగ్లీషు పద్యం సందర్భం, *of course*, నాకు తెలీలేదు.

మీ ఉర్దూ 'తృష్ణ'—. ఉర్దూ అనగానే నాకు సన్నిహితం.

"కళ్ళతో తాగుతాను"—

ఆ *picture* అంతా చాలా దగ్గిరిగా, ఏవో మరిచిపోయిన *desires* (అంటే పూర్వజన్మలవి గావును) లేపుతో నా ఎదట విలిచింది.

మాట వదకొండు

ఉర్దూలో చాలా గొప్పగా వుండివుంటుంది. ఏంచేసినా ఆ *spirit* రాదు. తెలుగు చంపింది— అంది సౌరిస్.

20 జూన్ 1956 శ్రీరమణాశ్రమమ్

చలం

...20...

చలం

వజీర్ రహ్మాన్ గారికి,

మీ రెండు ఉత్తరాలు ఒకేసారి అందాయి. మీ ఆరోగ్యం బావుందనుకుంటాను. మీ పెద్ద ఉత్తరం సౌరిస్‌కి చదవడమే ఓ గంట పట్టింది, నేను పడుకునే కాలాన్ని మింగేసింది. ఉర్దూ భాషా, దాని ఉత్పత్తీ, స్వరూపం; తెలుగు భాషా, దాని ఉత్పత్తీ, వీటి మీద అడుగడుక్కీ మాట్లాడారు ఈశ్వరుడు.

( సౌరిస్ అంతర్వాణి ఈశ్వరుడు. సౌరిస్‌లోంచి ఈశ్వరుడు పలుకుతున్నారు— వ॥ర॥ )

అవును, ఉర్దూని తెలుగు చేస్తే లాభంలేదు. తెలుగు ఛాందసుల భాష. దాంటో ఈ *niceties* గాని, *passion* గాని పలకవు. అవును. అసలు ఏ రచయితకీ ప్రఖ్యాతి అనేదిలేదు ఈ హిందూదేశంలో, ముఖ్యం ఆంధ్రలో. వీళ్ళు మాట్లాడే పాత కొత్త రచయితల పేర్లేగాని, వారు రాసినవి వీరు చదివి వుండరు. చదివితే, వీరికి అర్థంకావు. పైగా, మా సారస్వత హృదయం, తెలుగు గడ్డా, ఇట్లాంటి బీరాలు పలుకుతారు. నేనే ఉదాహరణం. తెలుగులో ఎవరేం రాశారో, రాస్తున్నారో నాకు తెలీదు. భేదం, నాకు తెలీదంటాను నేను. తెలీవలిసిన అవసరమూ కనపడదు.

నా కిందటి ఉత్తరంలో మీరు *underline* చేసిన భాగాల అర్థం ఏమిటని నాకు *refer* చేశారు. మంచిపని అయింది. సందేహమేముంది? "నువ్వు" అంటే మిమ్మల్ని అని అర్థమా? అట్లా అనుకుని కోపగించుకుని వూరుకున్నారు కారు. నయమే.

అట్లా రాసిన నా ఉత్తరంలో, తనని అంటున్నానని తప్పు అర్థంచేసుకుని, వసంత్ వెళ్ళిపోయి ఏడళ్ళవుతోంది. అయినా నా కలానికి బుద్ధిలేదు. అట్లా పోతోనే వుంటుంది.

ఏవొక్కర్నీ మనసులోపెట్టుకునిరాయలేదు ప్రజలందరూ-శృంగారమంటే అర్థంగాని ఈ గుంపునంతా.

రాశానుకదా, '—' పేరు రానీకండి, అచ్చులో.

అవును. ఆపేరా అట్లానే ప్రచురిస్తే, మిమ్మల్ని అన్నట్టు అవుతుంది. "నీ" బదులు "వీళ్ళు" అని పెట్టండి. *Force* పోతుంది. కాని, అంతకన్న ఏంచెయ్యాలో నాకూ తోచటంలేదు.

మీరు పంపిన (చీకటిగదిలో....) గీతాన్ని నేనూ, సౌరిస్. ఇద్దరమూ చాలా ఇష్టపడ్డాము. నేను మాత్రం ఇంకావుంటే బావుండును అనుకున్నాను. సౌరిస్ వొప్పుకోలేదు. అది చాలదా? అంది.

మా తోటలో మొన్న చివరిమల్లెపువ్వు పూసింది ఇవాళ చివరి మామిడిపండు 'హిమాన్ పసంద్' బైటికి తీశారు రంగ నాయకమ్మగారు. ఇవాళ కూడా కోవెల కూసింది, సినీమాలకి భయపడకండా. మాకూ, సినీమా హాలుకీ మధ్యవుంది వూరంతా. సరిగా తూర్పు కొనన హాలూ, పడమటి కొనన మేము. మాఇంటి తరవాత అడివి. ఇంక ఇళ్ళులేవు. కరంటులేక సినీమాగోల తగ్గింది. అయినా ఆవాసన ఇక్కడికి కొడుతుంది. రెండున్నర మైళ్ళదూరం.

అచ్చులో వున్న పుస్తకం *progress* ఎట్లావుంది? ఇట్లా ఉత్తరాలు చేరుస్తోవుంటే, ఆపాట అంతమెప్పటికి? నాకు తొందర అని కాదు. వూరికే పనిలేక రాస్తున్నాను— కఠినమైన ఉత్తరం ఒకటి జవాబుకి కాచుకుని వుందనే లక్ష్యం లేకండా!

కాలేజి తెరిచివుంటారు.

సృష్టిపెట్టిన దేహభారం కాక మానవుడు పెట్టిన విద్యా భారం. రోజూ డాలీకి నేను చదువు చెపుతాను— 6 × 8 = 54 అనుకుంది. కాదని దిద్దడం నాకు సిగ్గు. ఎందుకు 54 కాకూడదు?

నాకేంతెలుసు ఎన్నో! నాకు నేర్పిన గాడ్దికి ఏంతెలుసు? అద్దంలో శ్రీరాముడు చంద్రుణ్ణి చూశాడు, అని డాలీ చదువుతోవుంటే, ఆ రాముడు వుత్త *idiot* అనడానికి వీల్లేదు. ఈ జన్మలో ఘోరమైన పాపాలు చేశేవారు, వొచ్చే జన్మలో చదువుకోవలసి వొస్తుంది. ఆ లోకంలోని నరకానికి *branch open* చేశారు ఈలోకంలో, ఈబళ్ళల్లో, కాలేజీలలో. మానవుడి *original sin* ఈకాలంలో చదువు రూపాన పుష్పించింది.

26 జూన్ 1956 శ్రీరమణాశ్రమమ్

## చలం

## ...21...

వజీర్ రహ్మాన్ గారికి,

మీ పెద్దఉత్తరం. నిన్న 10–30కి చదవడం ప్రారంభించాం. ప్రతి అడుగునా ఆపి ఈశ్వరుడు *comment* చేస్తున్నారు. 12 గంటలకు పూర్తి అయింది. నేనుపడుకోలేదు. నడుం లాక్కుపోయింది. అయితేనేం? మీరు వుండి ఆయన *dissertations* వింటే ఎంత సంతోషిద్దురో. ప్రతి *point* లోనూ మీతో *agree* అయినారు.

నేనేం జవాబు రాయగలను? మీరు రాసిన విషయాలపై నాకు జ్ఞానమే చాలా స్వల్పం. పైగా ఆ *lines* ప్రకారం నేనెక్కువ యోచించినవాణ్ణికాదు. *Wonder* చేసి వూరుకున్నాను.

వర్షం నాకు పుట్టినప్పటినించి ఇప్పటి వరకు అసహ్యం. అందులో తెనాలి వర్షాలూ, కాకినాడ వర్షాలూ నన్ను ఎక్కువగా బాధపెట్టాయి. మరీ కాకినాడ వర్షాలు. అరుణాచలం వర్షాలు చాలా *enjoyable, unexpected.* ముసురు అనేది ఎప్పుడోగాని పట్టదు. తెరిపిఇవ్వకండా ఓగంట వర్షంకురవదు. చాలావరకునిద్రలో వెళ్ళిపోతాయి. పైగా ఇక్కడ ఇంటో వర్షంతో సంబంధం లేకండా, బైట అడుగు పెట్టకండా, ఎంతకాలమైనా బతకవొచ్చు.

పుస్తకం అచ్చుకి చాలా శ్రమపడుతున్నారు. ఎందుకు? వొదలండి. అయినప్పుడే అవుతుంది. కాని అది ఓ *enthusiasm or a delight* ఐతే మాత్రం, కానీండి. ఎంత శ్రమ ఐనాసరే. పుస్తకం కోసంకాదు— *enthusiasm and delight* అనేవి జీవిత లతకి పరిమళించే చాలా అపురూపమైన పుష్పాలు.

తెలుగువాళ్ళు వుత్త అరుపులు తప్ప. చాలా *shallow people.* కళకీ, వీళ్ళకీ చాలాదూరం. *Cultural aspect* అసలు వీళ్ళకి ఏమీపట్టదు– అరవడానికితప్ప. ఎవరూ ఏదీచదవరు– చదివిందివీరిని కదిలించదు. *Deep*గా వెళ్ళదు వీళ్ళ మెదళ్ళలోకి. వెళ్ళినా నిలవదు. ఎక్కడో ఓ అడావిడి జరుగుతోందని వింటే, అంతా మించిపోతుందని పరిగెత్తుతారు–అంతామరిచి. మనిషిని గాని, *ideal* గాని ప్రేమించి అర్పించుకోడం వీళ్ళలోలేదు.

చచ్చిపోయిన క్షేత్రియ్య తిరిగిరాకేం? వొచ్చాడు నండూరి సుబ్బారావుకింద–వొచ్చి 'వెముకలు విరగతన్నాడు.'

ఈశ్వరుడన్నారు–తెలుగువాళ్ళకి*delicate touches* తెలీవు- అని. వాళ్ళ ఇంద్రియాలూ, మనసూ కూడా *strong stimuli* కి తప్ప ఎదురు పలకవు. తిండి, ఆవకాయి–పచ్చిమిరపకాయల గోం గూర పచ్చడి–కందిపచ్చడి. శృంగారమంటే–విరుచుకుని మీద పడి*rape* చెయ్యడం. కనకనే మీరు ఆవిషయమై ఎంతదూరంగా, ఎంత *delicate suggestion* ఇచ్చినా, వెంటనే వాళ్ళమనసు వాళ్ళకి అలవాటైన ఆ ఒక్క జ్ఞాపకం మీదికే పోతుంది. అందు కనే మనం రాసింది 'బూతు' అంటారు.

ఈమధ్య ఒక *student* రాస్తున్నాడు – నా యశోదా గీతా లలో, కృష్ణుడు యశోద కుచ్చెళ్ళలో తలపెట్టుకున్నాడని నేను రాస్తే- "అంతేచలం, బూతులుతప్ప ఏంరాయ" దని గోలట ఆ కాలేజీ *students.*వాళ్ళతో ఏంచేస్తారు చెప్పండి! అదీ ఆ భీమవరం కాలేజీ *culture.*వాళ్ళూ మీ కాబోయే ఆంధ్ర సారస్వతోద్ధారకులు. నేను రాయటం ప్రారంభించిన చిన్ననాటనే చాలామంది నాకు బోధించారు–నిందించారు– 'అట్లా బద్దలుకొట్టి చెపుతావేం? చాలా మోటుగా! ఘాటుగా! గొప్ప కవులు చూడు ఎంత *delicate* గా- లేవన్నారు, అందువల్లనే ఉర్దూ గీతాలు తెలుగు చెయ్యాలనే మీ

చెపుతారో' నని! ఏ అనుభవంలేని ఆనాడే నాకుతెలుసు! గండ్రిగొడ్డలి పెట్టుకి తప్ప కదలదని, బండబారిన ఆంధ్రి హృదయం! నా మీది అభిమానంకూడా చాలావరకు అదే, గట్టిగా తన్నగలిగాననిః

ఎప్పుడూ, ఎవడూకూడా నేను సున్నితంగా రాసినవి ఎత్తుకోడు! వజీర్ రహిమాన్ తప్ప.

ఎంత సహృదయుడూ, మహాఐతే నా *style* అంటాడు. అంతదగ్గిరగాఉండే రుక్మిణీనాధశాస్త్రిగారు ఈశ్వరుడితో నా సంగతి మాట్లాడుతో–"పిరిశైలి–"అంటున్నారు. ఆంధ్రుడు. ఏంచేస్తాడు! నన్ను మెచ్చుకునే విధం అది.

మీరు చెప్పిందంతా నిజం. భారతం, ముఖ్యం భారతంలో– కొన్ని ఘట్టాలలో గొప్ప గంభీరమైన కవిత్వముంది. పోతన్న చాలా రసాలు పలకగలడు. అవికూడా చేర్చాలి కవిత్వం కింద.

ప్రేమా, విరహమూనా– ఈ తెలుగు వాళ్ళకి ఏరీతిగానూ లేవు, బూతులుతప్ప. అదొక్కటే తెలిసినసంగతి వాళ్ళకి.

ప్రజావాంగ్మయమని అంతకొట్టుకున్న దీక్షితులుగారు, ఈ శృంగార ప్రజావాంగ్మయానికి బధిరులు. వారి మడికి–మైల అవి. అట్లాంటివి వున్నాయనికూడా సూచించనన్నాలేదు ఆయన. ఆయన ప్రేమించే చలానికి, పాపం, *sex* పిచ్చి.

*Inspite of his sex and his rebellion, I cannot afford not to love him.* అదీ గొప్పేకదూ!

సుబ్బారావుగారి విషయమై మీరు చెప్పిందంతా నిజం. నేనూరాశాను - ఆయన పాటలకి వెనక ఆధారం తక్కువని,

*originality* ఎక్కువ అని. నేనన్నది ఈ అర్థంలో—అవును. జానపద గీతాల 1956 *development* ఎంకిపాటలు. కాని ఆ పల్లె పాటలు మా చిన్ననాటికి అసలు వ్యాప్తిలోలేవు. మాకువాటిని వినే *chances* చాలా తక్కువ. ఈనాడు మాత్రం?

సుబ్బారావుగారు నాతోపాటు *student.* సుబ్బారావూ, బసవ రాజు అప్పారావూ పాడేవారుకూడా. కవులుకాక పూర్వమే. వాళ్లేం పాడేవారో నాకుతెలుసు. కనక ఈ పాటలకి *back-ground* గా, వాళ్ళిద్దరుకూడా పాత పాటల్ని ఎక్కువగా ఎరగరు. ఎరిగివుండి బైటికి పాడటానికి జంకేవారో!

పాతపాటల *tradition* సుబ్బారావుకి *conscious* గా తెలీదు.

నేనిదివరకు రాసినట్టు అతని పాటలకి గొప్పలోతూ, ధ్వనీ పట్టాయి.

వాటి *economy* చూడండి. ప్రతి మాటకీ ఓ ప్రయోజన ముంది ఓ *setting* వుంది.

ఎన్నాని చెప్పేది ఎంకి (పాటల) ముచ్చట్లు!

మీరు నాకు ఉదాహరణకి రాసిన జానపద గీతాలు — అవి నాకు ఒక *revealation.* ఇట్లాంటివి తెలుగులో ఉన్నాయని నా కెన్నడూ తెలీదు.

క్షేత్రయ్య పదాల్ని గురించి—భావం *delicate* అయినా, అవి భాషలోకి వొచ్చేప్పటికి *blunt* అయినాయి, అన్నారు ఈశ్వ రుడు. అసలు తెలుగు భాషలో ఏవిషయమైగాని—ముఖ్యంశృంగార విషయంలో— *delicate touches* ని నిరూపించగల మాటలు

మాట పంతొమ్మిది

ప్రయత్నం అంత *despondant* అయింది.

శృంగారపు నాజూకుల్ని వ్యక్త పరిచే పదజాలం ఎట్లా వుంటుంది.? కొన్ని సంస్కృత పదాల్ని ఎరువు తెచ్చుకున్నారు కవులు. బూతు పదాలు వేనకువేలు తెలుగులో—అంతే. అందుకని క్షేత్రయ్యవంటి *artist and* రసికుడుకూడా ఆభాష మోటుతనం నించి తప్పించుకోలేక పోయినాడు.

తెలుగుభాష ధ్వని—మృదులం. కాని భావం—అతిమోటు. మీరేదన్నా చాలా నాజూకుగా వాడినా, దాన్ని మోటుగా తప్ప అర్థం చేసుకోలేదు తెలుగు మనిషి.

మీరు రాసిన మోస్తరు పల్లెపాటలు ఎక్కడో ఒకటి రెండు పొరపాటున విన్నాను. నాకీకవులలో మిత్రులు లేకపోయినా, అందర్నీ ఎరుగుదును. ఒక్కరూ నాకు వినిపించలేదు, ఈపాటల్ని. అంటే తెలుగు సారస్వతం ఎటువంటి హీనస్థితిలో వుందో వూహించుకోండి.

మీరు చాలా కృషిచేస్తున్నారు. ఇట్లాంటి పాటలు ఇంకా వున్నాయంటున్నారు. వాటిని పోనీకండి. అచ్చులోకి ఎట్లాగో రావాలి! ఎవరికోసం— ఈ తెలుగువాళ్ళకోసమా! కాని ఏమిటో, ఆపాటలు నశించడం వొప్పుకోదు మనస్సు. వాటిని అచ్చులోకి తయారు చెయ్యండి. మనిద్దరం ఉపోద్ఘాతాలురాసి, ఎవడి చేతనో, నయానో, భయానో,బతిమాలో, బేరంపెట్టో అచ్చు వేయిద్దాము.

'ఒరే ఏంచేస్తున్నారురా!' అని ఈ కవుల్నీ,తెలుగు వాళ్ళనీ అడుగుదాము.

మీ *tastes* మా *tastes* ఎంతదగ్గరో! పాకిస్తాన్ రానంత వరకు, రేడియో అంటే మాకు, ఢాకా, తప్పితే కలకత్తా! పల్లె

గీతాలకోసం. ఇప్పుడు వినపడవు. బెంగాలీ పల్లెగీతాలు *modernise* అయిపోతున్నాయి. రేణుకాదేవి — అర్ధంతెలీదు. కాని వినేవాణ్ణి.

మల్లికా పుఖ్రాజ్ అనే పేరు విన్నాను. సౌరిస్‌కి తెలుసు ఆమె పాట ఆమె పాటని గురించి మీరు ఇచ్చిన *description* సరిగా ఇచ్చింది తనుకూడా. నేనూ విన్నానుట. ఇష్టపడలేదుట— అంతే ప్రత్యేకంగా ఏమీ. నాకు రసూలన్‌బాయి, అక్తరీ బాయి— ఇష్టం—అర్ధం తెలీకండానే

నా *Musings* లో (పుస్తకంలో రానివాటిల్లో) జావళీలని గురించి రాశాను. ఎక్కడరాశానో మళ్ళీ కనపడలేదు. పోయింది. మీరెక్కడన్నా చదివారా?

టాగోర్— *Head of a Woman*— చిత్రం, గొప్పగా వుంది. ఆయన పాటల్లో తెలీని *aspects* కనపడుతున్నాయి, ఆయన బొమ్మల్లో. మొన్ననే ఓ రమణ భక్తులూ, రచకులూ తిడుతున్నారు, టాగూర్ గీసిన వాటిని.

నాకు *painting* సంగతి ఏమీ తెలీదు. తెలుసునన్న ఆంధ్రులకి, నాకు తెలిసినంతా తెలీదు.

ఈశ్వరుడన్నారు— చైనా *culture, painting and writing* మాత్రమే కాదు— *speaking, tea-making, stealing and smoking and murdering*— అన్నీ కూడా ఓసాంప్రదాయ బద్ధమైన *cultural unity* వుందని, అంతకన్న *culture* వూహించుకోలేమని. దాని తరవాత *ancient Indian culture*, దాని తరవాత *Muslim culture*.

ఇంక నేనూ ముగిస్తాను. ఈశ్వరుడే *explain* చెయ్యాక

పోతే, మీరు రాసిన విషయాలు వుత్త పేర్లే నాకు. వాటి సంగతి ఏమీ బొత్తిగా తెలీదు నాకు.

మీరే *cultural activity* కి పూనుకుంటే, దేశానికి ఓ తోవా తెన్నూ కల్పించగలరేమో ననిపిస్తుంది.

చలంలోంచి కవిత్వం చూసి మీరు లాగిందాకా, వాళ్ళకి ఆ దృష్టే రాలేదుకద!

వాళ్ళకి మీరు బోధించవలిసింది చాలా వుంది.

తనలో కవిత్వమున్నదని తెలుగువాడు చలానికే తెలీదు.

మీరు *Laurence Hope* రాసిన *Garden of Kama* చదివారా?

8 జూలై 1956 శ్రీరమణాశ్రమమ్

చలం

...22...

వజీర్ రహ్మాన్ గారికి,

మీ పెద్ద ఉత్తరం. జయదేవని, విద్యాపతిని గురించి చాలా సేపు మాట్లాడారు ఈశ్వరుడు. విద్యాపతిని, నేనుగాని సౌరిస్‌గాని చదవలేదు, వినలేదు. ఆయన రాశాడనిగాని, ఏం రాశాడో గాని మాకు తెలీదు ఈశ్వరుడు మాట్లాడడంవల్ల తెలిసింది. ఆమాటలన్నీ *short-hand* తీసుకుని మీకు రాయ గలిగితే– రాసినందుకు నాకూ, ఆ అభిప్రాయాలు తెలుసు కున్నందుకు మీకూ తృప్తిగా వుండేది.

జయదేవ; *finite* ని తీసుకుని దాంటో *infinite* ని ధ్వనింపచేశాడు. విద్యాపతి *infinite* ని *finite* లో ఇమడ్చా లని చూశాడు. అతనికన్న చండీదాస్ కీర్తనలు గొప్పవి. విద్యాపతి చాలా సుఖంగా, ఓ మందిరములో కూచుని, తన ఉల్లాసానికి, సౌందర్య తృష్ణని తీర్చుకోడానికి, కృష్ణుణ్ణి తనమందిరంలోకి మర్యాదగా ఆహ్వానించాడు. చండీదాసు, గొప్ప *struggle* తో, *passion* తో, కృష్ణుణ్ణి తన హృదయంలోకి పిలుచుకోవాలని పెద్ద తపన పడ్డాడు.

కాని, జయదేవ గీతాలకివున్న *finish,* మృదుత్వం, ఒక్క వ్యర్థపదం లేకపోవడం, శృంగారం, శృంగారంలో మార్ద వత్వం, ఆశృంగారంలోంచి, *the love play of the infinite with the finite, and the passionate pain of longing of the finite for the infinite,* ఇంకా ఎక్కడా కృష్ణుణ్ణి ఆధారంగా తీసుకుని, అంత అందంగా, అంత *truth* కి దగ్గరగా కవిత్వవించలేదు–అని ఇట్లా ఎంతో చెప్పారు.

జయదేవుడు తిరిగి తెలుగుకవిగా పుట్టి, తెలుగుదేశంలోనే వున్నాడు ప్రస్తుతం.

నా ఉత్తరాలు మీ పుస్తకంలో *include* చెయ్యడంసరే, మీ ఉత్తరాలు చూస్తోవుంటే వాటిని నేను *publish* చెయ్యాల్సి వొచ్చేట్టుంది. మీరు తెలుగు *literature* ని, తెలుగువాళ్ళ *artistic bluntness* నీ, చాలా చక్కగా *analyse* చేస్తున్నారు.

అవును. ఒక్క కవిత్వాన్ని ఏమిటి, ఏకళనీ లోతుగా తీసుకోరు వీళ్ళు. దేనికోసమన్నా అర్పణా, త్యాగమూ అంటే వీళ్ళకి హేళన—ఒక్క పదవులకు తప్ప.

ఇంతవరకు, 'గీతాంజలి' తెలుగు కాలేదంటే, తెలీటంలేదా వీళ్ళసంగతి! టాగూరు అర్థమయ్యేది ఎందరికి! విశ్వనాథ సత్యనారాయణగారికీ, శ్రీ శ్రీకీ కోపం ఆయనపైన.

అయినా వీళ్ళకిగాని, ఎవరికిగాని, *Tagore* కి *romantic life* వుందో, లేదో ఏంతెలుసు, ఎట్లా తెలుసు? *Romantic life* అంటే అర్థం ఓపెద్ద*scandal* రేపుతో ఎవరితోనో లేచిపోవడమూ, లేక ఆడవాళ్ళవంక దేవిరింపుగా చూస్తో వుండడమూ!

టాగూర్ కవిత్వదృష్టిని ఎంతబాగా, లోతుగా, అర్థం చేసుకోగలిగారో మీరు.

*Walt Whitman* చదివేను నేను. *Perfumtory* గా గొప్పగావుంది. కవిత్వం తక్కువ. బలం, *sincerety, passion for humanity* ఎక్కువ. *Whitman* యోగి-అన్నారు ఈశ్వరుడు. *Whitman* బూతా! వీళ్ళకి మతులు లేవు.

సరే. కానీండి. తయారైనపుడే ప్రచురిద్దాం పల్లెగీతాల్ని.

*Garden of Kama* మీరు చదవాలని వుంది. పంపమంటే పంపుతాను. నామంచి *edition* ఎవరో తీసుకున్నారు. కాని ఓ పుస్తకం వుంది.

*Sartre philosophy* పైన ఓపుస్తకం చదివినట్లుజ్ఞాపకం. నాకేం నచ్చలేదు. అతని కథ ఒకటి చదివాను. ఇంకా చదువుతున్నాను. ఏంబాగాలేవు, నా *taste*కి.

మేరీ కొరల్లే గొప్పది. నాకుమల్లేనే కొత్తది చెప్పాలనే ఆవేశంతో, *art* ని, *restraint* నీ చెడకొట్టుకుంటుంది. ఇప్పుడు ఆమె బాగా పాతబడ్డది. ఆమె ఆనాడు చాలా *popular, inspite of people's irritation.* అంత కసీ వుండేది. ఆపుస్తకాలు చదివేవారు, ఇక్కడ చలంమల్లేనే. ఆమెని *Indians,* బూతు రచయిత, అనుకునేవారు. *Immoral writer* అని పిల్లల్ని చదవనిచ్చేవారు కారు. ఇంగ్లీషువాళ్ళు ఆమెని తీసేశారు, ఆమె *treatment* వాళ్ళకి నచ్చకి. ఆమెలో టెక్నిక్ ఎక్కువ. *Theme* ఏమైతేనేం, ఆమెకలంలో శక్తివుంది. *Sincerety* ప్రజల కళ్ళు తెరవాలనే ఆవేదన వుంది. ఆమె *Soul of Lillith* చదవండి. మామూలు *material* నించి ఎంత ఎత్తుకుందో. కొన్ని *super-mental truths* ని విశదం చెయ్యాలని చూసింది. జీసస్ మళ్ళీ భూమికి వొచ్చినట్టు ఓ *novel* రాసింది. పేరు మరిచిపోయినాను.

ఆ *Pierre Louys* వి ఏం చదవలేదు.

నేను జావళీలపైన రాసిన *Musings* ఎక్కడన్నా సంపాయించగల *chance* మీకు వుంటుందా? నా చిన్నకథ 'రసపుత్రిలూ!'

నూట ఇరవయ్యైదు

ఈశ్వరుడు అడుగుతున్నారు– "రహ్మాన్ ఎందుకు *Tagore* ని తర్జుమా చెయ్యకూడదు?" అని.

"నువ్వూ చెయ్యగలవు. కాని నీ తర్జుమా *blank* గా తయారుఅవుతుంది. కాని రహ్మాన్ చేస్తే కవిత్వమౌతుంది" అన్నారు. కాని ఎన్ని చేస్తాడు మీరు!

అయినా ఈశ్వరుడన్నది జ్ఞాపకం వుంచుకోండి.

'ఇప్పుడప్పుడేకాదు' అని మీరు, మనిద్దర్నీ కలిపి అంటే, నాకు నవ్వొస్తుంది. మీకు సరే. ఇప్పుడుకాదు. బాగానేవుంది. కాని నాకు ఇప్పుడప్పుడే అనే దాంటో ఆట్టే కాలంలేదు.

20 జూలై 1956 శ్రీరమణాశ్రమమ్

చలం

...23...

వజీర్ రహ్మాన్ గారికి,

చివరికి నిన్న పోస్టుచేశాను మీ ఉత్తరం. పోస్టు చేసిన కాసేపటికి మీనించి మళ్ళీ వుత్తరం.

'హల్వా ఖర్ఫీ' అంటే నోర్లూరాయిమాకు. 'హల్వాసోన్' అనేప్పటికి పకపక మరీదుఖించింది. ఓ 15 రోజుల్లో చిత్ర హైద్రాబాదు నించి వొస్తుందిట. మా ఆశలన్నీ చిత్ర వెంట తీసుకొచ్చే పెట్టె *contents* మీద పెట్టుకుని ఎట్లాగో బతుకుతున్నాము.

మీరు *Voice of Silence* నించి ఇచ్చిన *quotations* బావున్నాయి. మరీ బాగాలేవు; అంటే అర్థం నాఅనుభవంలోకి రానటం లేదన్నమాట. ఎంతో కవిత్వం– *suggestion* – ఏదో నల్లని కలలోని దృశ్యం– లాగువున్నాయి. నా *sensivities* – మొద్దురకం. రుచిగాని, పరిమళంగాని, కవిత్వంగాని బలువుగా, స్పష్టంగా తాకాలి నన్ను. అవ్యక్తంగా, *suggestive* గా, దూరంగా వుందా ఏ *approach* అయినా, నానరాలు లాగుతాయి. అట్లాంటి కవిత్వం వల్ల శారీరికంగా బాధపడతాను– 'రా దగ్గరిగా రా– నా చేతికి అందేట్టు రా' అని. స్త్రీ ఐనా అంతే. ఆంధ్రుడి *blunt* తత్వం ఎంత వుందో నాలో! అంధుణ్ణి కాదు, చూస్తాను. ఆ అనుభవంబాధ. అందుకని తోసేస్తాను. మీరెండో *quotation* భయమేస్తోంది కూడా.

"ఇందులో దేనికీ అర్థం స్థిరం కాదు. మనమెట్లా అన్వయమిస్తే, అట్లా తిరుగుతాయి" అన్నారే, అట్లాంటి రాతలే చాలా

గొప్పవి, అన్నారు ఈశ్వరుడు. ఆయన స్వరూపం అంతేగా!

అవును. మీ *Archibald Macleish* అన్నది చాలా వాస్తవం. కాని రాసేదెవడు అట్లా! దాన్ని అర్థంచేసుకునేదెవడు?

ఉపనిషత్తుల సంగతి నాకేం తెలీదు. తెలిసినకాస్తా నేను తెలుసుకోలేదు. కాని, కొన్ని *selections* వింటో వుంటే ఎంతో గొప్పగా వుంటాయి. ఈశ్వరుడన్నారు— ఉపనిషత్తులు ధ్వని ప్రధానం. వాటి తర్జుమాలు వుత్తబీరకాయ పీచులు.

నాకు తెలిసిన కాస్తలో ఉపనిషత్తుల సంగతి—ఈశ్వరుడి *nature* నీ, స్వభావాన్నీ వెతికారు, ఆ రుషులు. దేన్నీ *granted*గా తీసుకోకండా, అసలు సంగతి ఏమిటో స్వయంగా చూడాలని ప్రయాణమైనారు, *into the unknown, the unknowable.* వాళ్ళ ప్రయాణంలో, ఒక్కొక్క విశేషం కనపడుతున్న కొద్దీ, 'ఇదీ, ఇదీ,' 'ఇదికాదు, అదికాదు.' 'ఇదీ' అంటో ఎంతో— ఆ కొత్త *discovery* ఒకగొప్ప *adventure* కింద గంతులేస్తో రాశారు. మళ్ళీ ఏ*exaggerations* లోకీపోక, *scientific precision* తో, *poetry* ని మించిన *poetry* లోకి *break* ఐనారు. ప్రపంచపుచివరి విజ్ఞానానికి గొప్ప *contribution* ఉపనిషత్తులు. *It is an exploration. It is a chart into seas unknown, a chant of triumphant discovery.* ఇవన్నీ తెలిసీ, తెలియని నా స్వంత అభిప్రాయాలు.

లేదు. లారెన్సు వ్యాసంచదవలేదు. వోపికవుంటేపంపండి.

నా పుస్తకాలా! చాలావరకు ఏ చిరిగినకాపీలో నా దగ్గర వున్నాయి. అవి *reprint* కి పోగుచేసి దాచినవి. ఇంకెవరిదగ్గర వుంటాయో తెలీదు. నాదగ్గరా అన్నీ వున్నాయనే అనుకోడం.

తెలుగువాళ్ళ ప్రియమైన పదాలు మీకు తెలుసా!

1 'గుత్తివంకాయ కూరోయ్ బావా' — — — బసవరాజు అప్పారావులోని — — — *side* అంతా ఆ వంకాయిలో కూరాడు.

2 'చెరగుమాసె — ఏమి చేతురా' — — — అంతకన్న లేకి శృంగారం ఆలోచించుకోగలరా?

3 (మరిచాను మొదలు) 'తూరుపు తెల్లవారె — పోరా, ఈవేళకూ' — — —అని వుంటుంది. అదోటీ, ఎంత డోకోనాకు!

ఇంక వాళ్ళ రసికత్వానికి వేరే *tests* ఏంకావాలి?

నా పుస్తకాల కాపీలు నాదగ్గర వుండేవికావు. ఈ వూరు వొచ్చేప్పుడు, ఇంక రాతలతో ఏంపని లేదని, ఇంక వాటిని స్మరించకూడదని—అన్నీ మా *boiler* లో పెట్టేశి వొచ్చాను. తత్సంబంధమైన ఒక్క కాయితం ముక్కైనా మిగలకండా. నా పుస్తకాల్ని తగలెయ్యడం ఇష్టంలేక, చప్పుచప్పున దొరికినవి పోగుచేసి, ఓ *parcel* కట్టి, ఓ మిత్రుడికిచ్చి, "దాచెయ్యి దీన్ని విప్పకు—దీని *future* నాకేంతెలీదు" అని ఇచ్చి వొచ్చాను.

ఇంతలో ఎవరో వాటిని *publish* చేస్తాననడం. నా *sinking finances* కారణంగా, ఆ వందరూపాయలే ఘనమై-ఆ పుస్తకాల్ని నాకు పంపమన్నాను నా మిత్రుణ్ణి. నా *parcel* ని *post* కి తయారుచెయ్యమని *educated girls* కి చేతికిచ్చాడు. అంతకన్న నిప్పులో పారేస్తే నాకు సరిగా చేరేవి. వాళ్ళు *intellectual* గానేకాని *moral* గా *educate* కాలేదుకద! కొన్ని పుస్తకాలు హరించాయి. కాని లోపించినవి అదృష్టవశాత్తూ నాచే

తెలుగువాళ్ళ ప్రియమైన పదాలు మీకు తెలుసా!

1 'గుత్తివంకాయ కూరోయ్ బావా' — — — బసవరాజు అప్పారావులోని — — — *side* అంతా ఆ వంకాయిలో కూరాడు.

2 'చెరగుమాసె — ఏమి చేతురా' — — — అంతకన్న లేకి శృంగారం ఆలోచించుకోగలరా?

3 (మరిచాను మొదలు) 'తూరుపు తెల్లవారె — పోరా, ఈవేళకూ' — — —అని వుంటుంది. అదోటీ, ఎంత డోకోనాకు!

ఇంక వాళ్ళ రసికత్వానికి వేరే *tests* ఏంకావాలి?

నా పుస్తకాల కాపీలు నాదగ్గర వుండేవికావు. ఈ వూరు వొచ్చేప్పుడు, ఇంక రాతలతో ఏంపని లేదని, ఇంక వాటిని స్మరించకూడదని—అన్నీ మా *boiler* లో పెట్టేశి వొచ్చాను. తత్సంబంధమైన ఒక్క కాయితం ముక్కైనా మిగలకండా. నా పుస్తకాల్ని తగలెయ్యడం ఇష్టంలేక. చప్పుచప్పున దొరికినవి పోగుచేసి. ఓ *parcel* కట్టి. ఓ మిత్రుడికిచ్చి. "దాచెయ్యి దీన్ని విప్పకు—దీని *future* నాకేంతెలీదు" అని ఇచ్చి వొచ్చాను.

ఇంతలో ఎవరో వాటిని *publish* చేస్తాననడం, నా *sinking finances* కారణంగా, ఆ వందరూపాయలే ఘనమై- ఆ పుస్తకాల్ని నాకు పంపమన్నాను నా మిత్రుణ్ణి. నా *parcel* ని *post* కి తయారుచెయ్యమని *educated girls* కి చేతికిచ్చాడు. అంతకన్న నిప్పులో పారేస్తే నాకు సరిగా చేరేవి. వాళ్ళు *intellectual* గానేకాని *moral* గా *educate* కాలేదుకద! కొన్ని పుస్తకాలు హరించాయి. కావి లోపించినవి అదృష్టవశాత్తూ నాచే

వజీర్ రహ్మాన్ గారికి,

చాలా పెద్ద ఉత్తరం రాశారు. అన్ని సంగతులకీ జవాబు రాయవలసింది ఏమీ కనపడదు. మీరు *expect* చేస్తున్న నా రెండో ఉత్తరం మీకు చేరిందో, లేదో తెలీలేదు. మీ రెండోఉత్తరానికి నా జవాబు ఇది.

నాకు వానన్నా పడదు. వానలో తడవడమన్నా పడదు. సహారా ఎడారిమధ్య ఓ ఓయసిస్‌లో వుంటే బావుంటుందినాకు. వేడిఇష్టం కూడాను.

జయదేవని *original* సంస్కృతంలో తెలుసుకోలేకపోతే, తెలుసుకోనట్టే — అన్నారు ఈశ్వరుడు. కవిత్వంలో ధ్వని ప్రాధాన్యతపైన చాలా మాట్లాడారు. వారి *definition,* కవిత్వాన్ని గురించి, అరవిందో *definition* కి దగ్గిర అనిపించింది. *Ezra Pound* తో పూర్తిగా ఏకీభవించారు.

చండీదాస్ తన శృంగారాన్ని, ప్రేమని, వియోగాన్ని ఈశ్వర పాదాలముందు అర్పించారు. ఈ ప్రజలు చూసే ఆధ్యాత్మికార్థం వుండదు వాటిల్లో. ఇవి వీళ్ళరుచి. కాని అతని కవితాప్రవాహం ఈశ్వర పాదాల్ని కన్నీళ్ళతో తడుపుతోనే ప్రవహిస్తుంది. ఆ *touch* లేంది, ప్రేమ మానవత్వాన్ని దాటంది, గొప్పతనం పట్టదు — ప్రేమకిగాని, కవిత్వానికిగాని. ప్రేమని లోతుగా తీసుకోవడమే భక్తి. స్త్రీని ఆరాధిస్తేనేగాని, అంటే ఆ స్త్రీని కాదు, ఆ స్త్రీలోని స్త్రీ శక్తిని; సౌందర్యాన్ని, అంటే సౌందర్య తేజస్సును, మాంసాన్ని కాదు, ఆరాధిస్తేనేగాని

ఆ ఔన్నత్యంరాదు. అదే ఈశ్వరుడికి సమీపంగా తీసికెడుతుంచి. ప్రేమకీ, ఔన్నత్యం,కవిత్వం పడుతుంది. కవిత్వంలో ఈశ్వరుడి విషయమూ అఖ్ఖర్లేదు, భక్తి సంగతీ అఖ్ఖర్లేదు. స్త్రీపైని అట్లాంటి ప్రేమే ఆధ్యాత్మికానుభవం. చచ్చిపోయిన స్త్రీ, తన జీవితంలో ఓ శక్తిఐ నడిపించి, తనకి ఆనందాన్నిస్తోవుంటే, ఆ గుణమే కవిత్వానికి పడితే, ఇంక వేరే భక్తివుండాలా! *Dante* చూడండి— కనపడని స్త్రీకోసం వెతికి వెతికి, పిలిచి పిలిచి, లోకాన్ని లోపలికి పిలుచుకుంటాడు, ధీరుడు. టాగూరుమల్లే.

మీరు రాసిన సంగతులే ఇంకో భాషలో రాస్తున్నాను. వాటి విషయమై ఈశ్వరుడు మాట్లాడినవి, జ్ఞాపకం వున్నంతవరకు.

మీరిచ్చిన *quotations* ఎంతో బావున్నాయి. ముఖ్యం నాకు చండీదాస్.

ఇదివరకు నేను రాశానని జ్ఞాపకం, *Musings* లో. ఇప్పుడు ఈశ్వరుడూ చెప్పారు—ఒక్కొక్క కాలంలో. కొన్ని కొన్ని కవితా భావాలు గాలిలోనే *vibrate* అవుతోంటాయి (*scie-ntific truths* కూడా.) వాటిని *sensitive souls catch* చేస్తారు. ఓకే సంగతిని ఆ దేశంలో ఒకరు, ఈ దేశంలో ఒకరు పాడితే, మనం *plagiarism* అనడానికి వీలులేదు. కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, నండూరి, ముగ్గురి కవిత్వంలో ప్రతి అక్షరం *originality* ని శబ్దిస్తుంది. *Influences-conscious and unconscious* ఎప్పుడూ వుంటాయి. షేక్స్పియర్, టాగూర్‌లో అన్నీ ప్రతిధ్వనులే. కాని *originality* ఎక్కడ పోయింది? నజ్రుల్ ఇస్లాం కవిత్వాన్ని వినివున్నా, వాళ్ళని *influence* చేసే *chance* ఎక్కడా లేదు. నా 'పాపం!' లో కథలు కొన్ని చూడండి. అవన్నీ మోపాసా టెక్నిక్. నేను బాగా చదివి పట్టుకున్నాను, మోపాసాని. కాని ఆకథలు పూర్ణంగా నాకు *original.* పట్టుకున్న టెక్నిక్ విలవదు

*creative artist* లో. తొరలోనే దాన్ని మించి, వెనక వొదిలి వెళ్ళిపోతాడు. అట్లాగే వాళ్ళ కవిత్వంలో ఎన్ని *echoes* విన్నా, వాళ్ళ ప్రతిభని ఏమాత్రం తగ్గించడానికి వీల్లేదు. ఈశ్వరుడూ అదే అన్నారు.

మల్లవరపు విశ్వేశ్వర్రావులో పూర్తిగా తెలుగుది కాని *foreign element,* అతను జీర్ణం చేసుకోని *influence* కక్కా కనపడుతుంది. ఎక్కడనించి తెచ్చాడో తెలియనక్ఖరలేదు. కక్కా కంపు కొడుతోనే వుంటుంది. ఎక్కడనించి తెచ్చుకున్నా, దాన్ని జీర్ణం చేసుకున్నాడా, అది *artist* సొంతమే.

*Sri Sri is a great poet inspite of all this* - అనఖ్ఖర్లేదనుకుంటాను నేను. వూరికే, వాళ్ళకి *parallel* కవిత్వమనో *influence* అనో, అంటే చాలుననిఅనుకుంటాను.కృష్ణ శాస్త్రిలో బంగాలీకవిత్వపు ఛాయలెన్నో.కాని అవి అతనిసొంతమే.

శాస్త్రిగారికవిత్వంలో *moods* ఎక్కువ.ఒకదానికీ.'ఇది'అని నిలబడడు — శ్రీ శ్రీ మల్లే, సుబ్బారావుమల్లే. నజ్రుల్ ఇస్లాం స్థిరంగా నించునట్లు అవుపిస్తారు కాని శాస్త్రిగారి జీవితానికి పట్టిన జాడ్యమే కవిత్వానికీ పట్టింది. అతనికే ఓ *back - bone* వుంది, ఓ సత్యానికి ధీరుడై నిలబడివుంటేనా........

మీరు నాపైని రాసిందిచదివితే,పండిత్ తారానాధ్గారన్నది జ్ఞాపకం వొస్తోంది —

"మిమ్మల్ని దేశంలోంచి తరమకండా ఎందుకు వూరుకున్నారు తెలుగువాళ్ళు?" అని.

నా పుస్తకాలకోసం తెలుగు నేర్చుకున్నవారిలో ప్రధములు వారు.

అది వరకు, తెలుగువాళ్ళ *sense of humour* ఏమో నన్ను దేశంలో నిలవనిచ్చింది — అనుకున్నాను కాని, మీరు చెప్పింది చాలా నిజంగా కనపడుతుంది. నా పుస్తకాన్ని చాలా గట్టిగా పొగుడుతూ, అసలు ఆ పుస్తకాన్ని ఎందుకు రాశానో. ఆ విషయానికే విరుద్ధంగా మాట్లాడతారు. బాగా దృష్టికలవారు కూడా. ఆ మాత్రని మింగడం ఇష్టంలేదు. చాటుగా ఉమ్మేస్తారు. ఉమ్మేసిన సంగతి వాళ్ళకే తెలీదు.

'గీతాంజలి' తెలుగు గీతాలలోకి ఎప్పుడూ రాదు. *Prose-poetry* లో చెయ్యవలిసిందే. అదే అన్నారు ఠాకూరు 'కనకమేడల' వారి అనువాదంలో నిశక్తి నాకిపొద్దున్న భోజనంలో రుచిని పాడు చేసింది. రోజుకల్లా ఒకటే భోజనం, అది పాడు చేశాడు. కోళ్ళకి ఆ కవిత్వం వినిపించకండి, ఇంక తినవేరు వాటిని.

నేను రాస్తున్న కాలంలో ఇంకో విశేషం జరిగేది. నేను దేనినన్నా వెక్కిరిస్తో రాశానా, దేన్ని వెక్కిరించానో, అట్లాంటి రచనలు వెంటనే ఆగిపోయేవి 'తెలుగునవల' రాశాను, అట్లాంటి నవలలు మళ్ళీ రాలేదు. అభ్యుదయం చాలా జోరుగా వుండే రోజుల్లో 'కొత్తచిగుళ్ళు' రాశాను — కాపువాడిపైన పద్యాలు, మొదలైనవి. శ్రీ శ్రీ అనుకరణలు, 'పూతాలు, పేలితాలు' చాలావరకు ఎగిరి పోయినాయి. ఆకథకి నా మీద చాలా కసిపూనారు, కుటుంబరావు మొదలైనవారు. కాని ఆగిపోయినాయి. 'హంకో మొహబ్బత్' లో- 'లేవరా ఆంధ్రుడా' రాయగానే, ఆ ఆంధ్రమాత గీతాలు ఆగాయి. ఆంధ్ర *state* వొచ్చాక కూడా తలెత్తలేదు. అంటే, వాళ్ళలోకి ఈ పైపై విషయాలు, నేను ఎక్కిరించినవి, వాళ్ళకే నవ్వు పుట్టించి ఆపారో, లేక వుత్త *coincidence* ఓ! ఏమైనా, చాలా సార్లు జరిగింది అట్లా. కనక

కొంత తీసుకున్నారేమో! నేను ఎక్కిరించినవి, వాళ్ళ *sense of humour* కి *appeal* చేసినవి తీసుకున్నారు. కాని, నా ప్రాణం పెట్టి చెప్పినవి, వాళ్ళ తలలపైనించి దాటిపోయినట్టున్నాయి.

టాగూర్ గీతాల్ని గురించి మీరు చెప్పింది చాలా సత్యం. బెంగాలీ పాటలు తెలీకండా, అర్థంకాకండానే అంటున్నానీమాట, ఇంగ్లీషు మాత్రం చదివి. ఎంతగాఢంగా, సరిగా తెలుసుకున్నారో, టాగూరుగారి కవిత్వం సంగతి మీరు!

చిన్నారావుగారు రాసిన *introduction* నాకు పంపడ మెందుకు? ఆయన రాస్తే నేను చూడనక్ఖర్లేదు.

మీ సైకిల్ తిరిగి వొచ్చిందా? నా *old horse* కి మల్లే, మీ సైకిల్‌కీ ఓ నామకరణం చెయ్యండి.

*Pierre Louys* గీతం చాలా బావుంది. 'మీ గీతం' అని మీరు రాశారే, ఆ 'మీ' నాకు కనపడలేదు, కాయితాల మడతలో

"నీకోసం నిద్రలో" – అనేవి చదివి, సౌరీస్‌తో, 'ఈ మాటలు నావిలాగు ధ్వనిస్తున్నాయే' అన్నాను. తీరాచూస్తే, ఆ 'మీ' కనపడ్డది.

ఈ మాటలు అనే వాటిల్లో ఎంతబలం వుందో! *Pierre* గీతంకన్నా నాదే బావుంది నాకు. కొంచెం వంకర తిప్పాడు, తన బాధని మాటల్లో. అదే ఇంకోరు, ఆ మాటలే రాస్తే ఆబాధ పలకదు. మాటలు – మామూలు మాటలు, *expression* లో ఓ చమత్కారం, వుపమానం లేవు. ఎట్లా వొస్తుంది ఆ బలం వాటికి? *Weight of the passion and pain* ఎట్లాగో పలుకు తుంది. అట్లాంటిది చూసినప్పుడు, ఎంత *materialist* కి *spiritual*

*values* మీద ఆశ్చర్యం వేస్తుంది. ఎట్లావున్నాయా – అని.

ఈ ఉత్తరం మొదలు పెట్టాక, ఎన్ని పనులో! పప్పు రుబ్బాలి. పోతున్నాము...........

పప్పురుబ్బడం మొదలైన పనుల్లోనే సరిపోయిందినిన్న. ఈవాళమళ్ళీ రాస్తున్నాను, ప్రారంభించి. మీ *express* వుత్తరం వొచ్చింది. చదవకండా దాచాను. మొదటి ఉత్తరానికి జవాబు ముగించాలికద! ఎన్ని పనులో నాకు! ఎక్కడా వ్యవధి దొరకటంలేదు.

మీకు దొరికితే *Louis Fisher -Mahatma Gandhi* చదవండి. అన్నట్లు, *Louis Fisher* కి ఓ వుత్తరం రాయ మన్నారు ఈశ్వరుడు. వ్యవధి ఏదీ! ఆయనే రాయించాలి. నా చాతకాదు.

పిఠాపురంలో మొన్ననే, నా *later books* లో నివసించిన 'లీలగారు' చచ్చిపోయినారు, 22 న. ఆ ప్రాంతాల్లోనే మీరు పిఠాపురం వెళ్ళివుంటారు.

15 ఆగష్టుకి మా ఆహ్వానం అందివుంటుంది. 5 ఏళ్ళ కిందట ఆరోజే ఈశ్వరుడు సౌరీస్‌కి కనబడి, మమ్మల్ని, తనలో నమ్మిన భక్తుల్ని నడిపించపోతున్నానని చెప్పింది. అందువల్ల ఆ రోజు ఉత్సవం. మిత్రుల్ని *expect* చేస్తున్నాను – అంటే ఈశ్వరభక్తులైన మిత్రుల్ని.

మీ *Lecturer,* మీ *answer book* పైన *'gas'* అని రాయడం అన్యాయమే – *'Romantic gas'* అనన్నా కనీసం రాయవలిసింది.

ఇంకా సినీమా *translators* అనే జాతి లోకంలో బతికి వుందా? పూర్వపు *antique* మృగాలమల్లే, అది *extinct* అయిందనుకున్నాను. సినిమాలకి వెళ్ళని వాడినైనా, ఆ జాతిపైన నా కసి అచ్చులోకి కూడా ఎక్కింది. కాని, ఓసారి —

ఏలూరులో ఒకాయన వొచ్చి, నన్ను వాళ్ళ ఇంటికి రమ్మన్నాడు. ఒక *youth*. నేను ఏమీ ప్రశించకండానే వెళ్ళాను. ఒక్క మాటలేదు. చాలా బీదవరండాలోకి తీసికెళ్ళాడు. అక్కడ ఓ అమ్మాయి కూచునివుంది.

"వీరే చలంగారు" అన్నాడుఅతను. ఆమెనమస్కరించింది. మళ్ళీ ఒక్క మాటలేదు, ముగ్గురమూ.

వెడతానన్నాను. వొచ్చేశాను.

తోవలో నాతో, ఒకటేమాట మాట్లాడాడు అతను. తాను పాండురంగ సినీమా హాలులో *translator* ని అని. మళ్ళీనాకు కనపడలేదు.

ఆ సినీమా *translator* మౌనం ఆలోచించుకోండి.

నాకెంత గొప్ప అనిపించిందో, ఒకమాట లేకండా, వాళ్ళు నాకు తమ గౌరవాన్ని సమర్పించడం! ఒక అరిటిపండో, ఏదో, నాకిచ్చినట్టు గుర్తు.

వాళ్ళ ఇద్దరి స్వభావాలూ, వారిద్దరిమధ్య ప్రేమా ఎంత లోతైౖ వుండాలి!

పూల సంగతీ, చెట్ల సంగతీ, ఇప్పుడిప్పుడే తెలుసు కుంటున్నాను ఈశ్వరుడినించి. నాకేం తెలుసు అదివరకు!

మాబుజ్జాయి (అవుదూడకి) జలుబు, తుమ్ములు ఎక్కువగా వుంటే, దగ్గిర కూచున్నాను. నా పాదాలకి తలని రాసుకుని ఆ బాధ తీసెయ్యమని ప్రాధేయ పడుతుంది. "ఏ బాధ వొచ్చినా తీసేస్తావే, ఇది తీసెయ్యవా?" అని, అడిగింది. దూడల్లోకి, కుక్కల్లోకి, పిల్లల్లోకి, మనుషుల్లోకి, మొక్కల్లోకి చూడగల దృష్టిని ఇప్పుడే నాకు బలవంతంగా ప్రసాదిస్తున్నారు ఈశ్వరుడు. "ఈ 'నేను', నాకు కావాలి. నేను నాకు ముఖ్యం. నాసంగతే చూసుకొంటా"ననే—ఈగోడల్లో ప్రయత్నించి కంతలుచేస్తున్నారు. కిటికీలు కొడుతున్నారు. ప్రేమవాకచే బద్దలుకొట్టగలదు, 'నేను', 'నాకే', అనే ఇనపకమ్ముల్ని, కాని ఆ ప్రేమనీ మింగేసి మళ్ళీ కొంచెం విశాలమైన ప్రహరీ కట్టుకుంటుంది, ఈ అహం. దాన్ని ఒక్క ఈశ్వరానుగ్రహం కాక ఏది పేల్చివెయ్యగలదు? మెల్లిగా తెరుచుకుంటున్నాయి కిటికీలు! రాళ్ళు వూడిపడుతోవుంటే బాధేమరి!

మనం ఇద్దరమూ చాలా పనులు వున్నవాళ్ళమే. పైగా మీకు సోన్ హల్వాలూ, కోడికూరలూ తినే పని కూడా. కాని ఈ ఉత్తరాలు — పైగా ఈ ఉత్తరాలు —

2 ఆగస్ట్ 1956 శ్రీరమణాశ్రమమ్

చలం

...25...

వజీర్ రహ్మాన్ గారికి,

మీ *express* వుత్తరం, ఇంకో వుత్తరం. ఒకటి ఎనిమిది గంటలకీ, ఒకటి పన్నెండు గంటలకీ. నేను ఓ బలువైన ఉత్తరం *post* చేశాను పదిగంటలకి.

ఎందుకు పంపారు చిన్నారావుగారి పీఠిక! నిన్ననే అనవసరమని రాశాను. కాని తీరా పంపారు. నన్ను చాలా కదిలించింది. అంత ప్రేమకి నేనేం బదులు ఇస్తున్నానని! వీలైనప్పుడల్లా చిన్నారావుగారిని చీవాట్లు పెడుతున్నాను.

నిన్న చిన్నారావుగారి మిత్రులు, నూజవీడు మానవతి గారికి వుత్తరం రాశాను — దాంట్లో భాగం ——

'నిన్న మీకు ఆ ఉత్తరం రాశాను — దాన్ని చదివి ఈశ్వరుడు —

"అదేమిటి? అట్లా రాశావు? బాధ పడదా ఆమె! సరిగా, ప్రేమగా రాయి" అన్నారు.

"నా ప్రేమే ఆ ఉత్తరం. ఆబాధలోంచి, నాకోపంలోంచి, నాప్రేమని చూడలేరా ఆమె?" అన్నాను.

"చూడలేరు. సరైన ఉత్తరం రాయి" అన్నారు.

అందుకని ఈ రెండో ఉత్తరం—— "........ ఎంతో ప్రేమతో రాయబోయి, నీతి ప్రచారకుడి మల్లే రాశాననిపిస్తోంది. నాచాత మూడోఉత్తరం రాయిస్తారో, ఏమో, ఈశ్వరుడు!"......'

మాట ముప్పయితొమ్మిది

— అదీ ఆ ఉత్తరం.

అట్లాగే చిన్నారావుగారిని నేను కోప్పడతాను. సరిగా కోప్పడనీరు ఈశ్వరుడు. ఎన్నిసార్లు చిన్నారావుగారికి నేను రాసిన ఉత్తరాలు చింపేయించేవారో! కాని ఆయన్ని కోప్పడితే అర్థమేమిటంటే —

"చిన్నారావుగారూ, మిమ్మల్ని చూసి, మీమాటలువిని ఎన్ని నెలలయింది! మీరు నాకు ఉత్తరం రాసినప్పుడల్లా, నానించి ఎంత దూరమైనారో, దూరాన వున్నారో, జ్ఞాపకానికి వొచ్చి బాధిస్తో వుంటుంది! మనలో వెలుగుతో మనని కలిపే జ్వాలపైన, యీ సంసారపు బుట్టల్ని ఎందుకు యింత దట్టంగా బోర్లిస్తారు?" అని.

ఇదంతా ఎందుకు రాస్తున్నాను మీకు! ఏంలేదు.

ఈరోజు వొళ్ళు బాగాలేదు. నాకు శలవ.

ఇట్లా చెట్లకేసి, ఆకాశంకేసి చూస్తో కూచుని ఎన్ని పేజీలు నింపేవాణ్ణో నా ప్రియులకి! ఈనాడు మీరే మిగిలారు, కాదు వొచ్చారు. నాఉత్తరాల్ని కాంక్షించి ఇంకెవ్వరూలేరు. ఉత్తరాలు రాయడమూ చదువుకోడమూ, ఈరెంటికీ తీరుబడిలేదు మనుషులకి, ఈనాడు.

*Public Examination hall* ల్లో నేను సూపరెంటుని. *Question papers* నాచేతుల్లోవున్నాయి. ఇంతలో *post-man* ఇరవై పేజీల ఉత్తరం ఇచ్చాడు. చదువుతున్నాను, *First bell, second bell. Q. papers* నేను పంచనేలేదు, కాలం గడుస్తోంది. ఉత్తరం చదువుకుంటున్నాను.

*Chief Supt. rounds* వొచ్చాడు. "ఇదేమిటి?" అన్నాడు. నేను మాట్టాడలేదు.

కోప్పడ్డం ప్రారంభించాడు. రిపోర్టు చేస్తానన్నాడు.

"ఇది కానీండి" అన్నాను.

కేకలు వేస్తున్నాడు. నేను కదలలేదు.

"గోల చెయ్యకండి. *Dont disturb me.*" అన్నాను.

చివరి వాక్యం చదివి పంచాను పేపర్లని. అందాకా ఆ *Chief* అట్లానే నుంచుని వున్నాడు.

బుజ్జాయి వొచ్చింది ఆస్పత్రినించి. ఇంటికి రాగానే నాదగ్గిరికి పరిగెత్తింది.

"నిన్ను పట్టుకుని బలవంతంగా మందు పోశారా?" అన్నాను. బుజ్జాయి కళ్ళంబడి నీళ్ళు. నామీది ప్రేమని భరించలేక, నన్ను కొరుక్కోవాలని చూస్తుంది.

మృగాలతో మాట్లాడడం, ఆభాష, పకపక కి సహజంగా వొచ్చు. సారీస్ మాట్లాడిందా, ఈశ్వరవాక్కు వాటిహృదయాల్లో ధ్వనించి వాటికి వెంటనే తెలుస్తుంది. నర్తకి, తన నిలపలేని ప్రేమతో కట్టేసుకుంటుంది.

ఏం చేతగానివాణ్ణి నేను.

ఎప్పుడన్నా, దొరికితే, నాదీ బుజ్జాయిదీ, పకపక తీసిన *snap* పంపుతాను.

చిన్నారావుగారి పీఠికా! ఒక్క అక్షరం మార్చనక్కర్లేదు. చిన్నారావుగారు బాగా రాయగలరు.

నామీద ఎంతో అభిమానం, మీపైని ప్రేమ — ఇన్ని వున్నా — ఇవన్నీ కూడా ఆ గీతాలకి *account* చెయ్యలేవు.

మాట వలదయొకటి

అవి *inspired!*

మనిద్దరిమధ్యా బంధుత్వంలో ఆయన ఎంత ఐక్యమైనారో!

మన బంధుత్వంకన్న, దాంటో ఆయన ఐక్యం గొప్ప సంగతి!

అట్లా కావడానికి, మనిషి అడుగున, ఆయనకే తెలీక, ఎన్నిజన్మలనించి తెచ్చుకున్న నిర్మలమైన హృదయ వైశాల్యం వుండాలో!

ఈశ్వరుదేమన్నారా! "చాలా బావుంది" అన్నారు. ప్రతి అక్షరమూ చాలా సంతోషంతో విన్నాడు.

ఆ పీఠికని గురించి నేను ఏమన్నా అనడం దాని గొప్ప తనాన్ని తగ్గించడం.

మౌనంతో కన్నీళ్ళుపెట్టుకోగలను — ఇంకేంలేదు.

చిన్నారావుగారు నాతో గడపిన గడియలన్నీ ఎంతో అందంగా గడిచేవి. మానవతిగారితో కూడా కలిసివొస్తే మరీని! మీరూ, ఆయనా ఎన్ని మాట్లాడుకుంటారో, సోన్ హల్వాకన్న మధురమైన ఎన్నికవిత్వాలు చదువుకుంటారో! కాలాన్ని ఎన్ని బరువైన భావాలతో నింపుకుంటారో ననుకుంటాను.

నిన్న ఈశ్వరుడన్నారు — "నేనే నిన్నిక్కడికి తెచ్చుకోక పోతే, నీ కాలం అట్లా గడిచేది. నీ జాతకం పనిచేసి, ఎంత మందో సహృదయుల్ని నీచుట్టూచేర్చేది. నీజాతకం పనిచెయ్య కండా ఆపి, కోసి, నిన్నుతీసుకొచ్చేశాను" అన్నారు.

మాయింటి ఓభాగంలో ఓ మహమ్మదీయ డిప్యూటీ కలెక్టరుగారు వుండేవారు. ఆయన మాట్లాడే తెలుగు సంగీతం

మల్లే వుండేది. వినడానికి పలకరించేవాణ్ణి ఆయన్ని.—ప్రస్తుతం నామిత్రులు జైనుల్ ఆబ్దీన్ (మనోహర్) గారు కూడా. పిఠాపురం కవిగారు కూడా వినడానికి ఇష్టంగా మాట్లాడేవారు. ఉర్దూ అలవాటైనవారు, తెలుగుకి ఓబలాన్నీ, స్పష్టతనీ ఇస్తారు—అందువల్ల అంత ఇంపు.

మీమాటలూ అట్లా ఉంటాయేమో! చిన్నారావుగారి మాటలే *artistic* గా వుంటాయి. వి. వి. నరసింహారావుగారు వొకరు.

బుజ్జాయికి ఏం నయంగాలేదు. మళ్ళీ ఆస్పత్రికి వెళ్ళింది.

ఈ వూళ్ళో గాలి ఏం మంచిదిగాదు. ఏడాదిలో ఎనిమిది నెలలు జబ్బుగా వీస్తుంది. వానా జబ్బువానే. రాత్రింబవళ్ళు హోరుమని వీస్తోంది. పైగా గాలికి ఎదురు ఇల్లు. మాఇంటోనే నివసిస్తానంటుంది గాలి· దాని తాకిడికి, మొక్కలు, పశువులు, మనుషులు నిలవలేకపోతున్నారు.

పుణ్యక్షేత్రాలన్నీ ఇంతే. వొచ్చిన యాత్రికుల పాపకర్మని కొంత భాగం అనుభవింపచేసి, వొదిలించి, పంపుతాయి.

మీ ఉత్తరాన్ని తింటానంటో గజంపొడుగున నాలిక జాస్తోంది చిన్నదూడ గంగ.

*Garden of Kama* అంది వుంటుంది. నేను *B. A.* చదివేప్పుడు *Laurence Hope* కవిత్వమూ, *Victoria Cross novels* మీద కలలు కంటో మద్రాసు బీచిమీద బతికాను.

ఈనాడు మీరు చదివినవీ, తెలుసుకున్నవీ చూస్తే—

ఇవన్నీ ఎందుకు? అసలుసంగతి చిన్నారావుగారి పీఠిక.

*Thrill* చేసింది నన్ను.

మాట నలభయిమూడు

"ఏం చలం? నువ్వింతటివాడివా?" అని అడిగాను.

చలం అన్నాడు—"అంతటివాణ్ణి కావలసినవాణ్ణే, అంత ఎత్తూ వుంది నాలో. ఉందని చెప్పారు ఈశ్వరుడు. కాని అనేక బలహీనాలు పట్టిన వుత్తమనిషిని—"

చిన్నారావుగారు, ఈపై పొరల్ని తొలిగించి, లోపలికి చూసి — నా 'నీలి నీడల్ని' పక్కకి తోసి, వాటి వెనక ఎక్కడో వున్న వెలుగులోకి తొంగిచూసి రాశారు.

రహ్మాన్ ఏరిన కవిత్వం ఎక్కడపుట్టిందో, ఆలోతు మూలలకిపోయి, చీకట్లో వెతికి, అసలు చలాన్ని తాకి రాశారు.

5 ఆగస్ట్ 1956 శ్రీరమణాశ్రమమ్

చలం

...26...

